

శ్రీమత్ హనుమదుపాసకులు - శ్రీ ప్రసన్న ఆంజనేయ స్వామి వారి

అనుగ్రహపాత్రులు - అత్యున్నత ఆంజనేయవిగ్రహ స్థాపకులు -

శ్రీదేవి ఉపాసకులు - వేదశాస్త్ర పరిషత్ వ్యవస్థాపకులు - వేద బ్రాహ్మణ సేవా

తత్పరులు - వేదపోషకులు - శ్రీశ్రీశ్రీ జగద్గురు కంచి కామకోటి పీఠాధీశ్వరుల

ప్రియశిష్యులు - సహృదయులు - ఉదార స్వభావులు - ధార్మికులు

**బ్రహ్మశ్రీ చంద్రాభట్ల చింతామణి గణపతి శాస్త్రి** గారి

సౌజన్యముతో "జెండాపై కపిరాజు" శ్రీఆంజనేయ స్వామి చరిత్ర - (అర్జున ఆంజనేయ వాగ్వాదము) అను ఈ గ్రంథము ముద్రించబడినది. ఈ గ్రంథ ముద్రణకు సహాయము చేసిన శ్రీ ప్రసన్న ఆంజనేయస్వామి వారి దేవస్థానం శ్రీ కంచికామకోటి మహాసంస్థానం- అధ్యక్షులు బ్రహ్మశ్రీ చంద్రాభట్ల చింతామణి గణపతిశాస్త్రి గార్కి, బ్రహ్మశ్రీ చంద్రాభట్ల పతంజలి శాస్త్రిగార్కి,

హృదయపూర్వక ప్రణామములు అర్పించుచున్నాను.

ఇట్లు

తేది. 10-01-2011 రచయిత

ఓం శ్రీమహాగణాధిపతయేనమః

ఓం శ్రీ సరస్వత్యైనమః    శ్రీ శారదాదేవ్యైనమః    శ్రీ గురుభ్యోనమః

# జెండాపై కపిరాజు

## (అర్జున ఆంజనేయ వాగ్వాదం)

తాత్పర్యసహితము


తెలుగు అనువాదం:

**గుళ్ళపల్లి వెంకటనాగ శ్రీరామశర్మ అవధాని**

ఇరగవరం.

08819-289457, సెల్: 9441172261

# జెండాపై కపిరాజు

సంకలనకర్త: గుళ్ళపల్లి వేంకట నాగ శ్రీరామశర్మావధాని

---


ప్రచురణ : 2011

ప్రతులు : 1000

ప్రచురణకర్త : గుళ్ళపల్లి వేంకట నాగ శ్రీరామశర్మావధాని





చిత్రకారుడు : శ్రీ 'వెంపటాపు'

వెల :



ప్రతులకు : గుళ్ళపల్లి వేంకట నాగ శ్రీరామశర్మావధాని
ఇరగవరం - 534217 (పోష్టు - మండలం)
ప॥గో॥జిల్లా.
ఫోన్: 08819-289457
సెల్: 94411 72261



ముద్రణ : ఆకాష్, సామర్లకోట - 533440.
ఫోన్: 0884-2327454



ఓం శ్రీమహాగణాధిపతయేనమః

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# విజ్ఞప్తి

కలౌ చండీ వినాయకౌ, కలౌ కపి వినాయకౌ, అని ఒక ఆర్యోక్తి. కలియుగంలో శీఘ్రంగా (త్వరగా) ఫలితాన్ని పొందాలంటే చండీ పారాయణ, చండీహోమాల ద్వారా చండీదేవిని, గణపతి హోమం ద్వారా గణపతిని, సుందరకాండ పారాయణం ద్వారా శ్రీ ఆంజనేయ స్వామిని ఆరాధించి సద్యఃఫలితాన్ని పొందవచ్చని పెద్దల మాట (ఋషివాక్యం). ఈ గ్రంథం ద్వారా శ్రీ ఆంజనేయస్వామి వారికి సంబంధించిన శ్లోకాలన్నీ పారాయణకు అనువుగా ఒక చోటకు చేర్చి, వాటి అర్థంతో పాటు శ్రీ ఆంజనేయస్వామి వారు అర్జునుని యొక్క "జెండా పై కపిరాజు"గా ఎందుకు ఉన్నారు, అనే ప్రశ్నకు సమాధానం కూడా ఈ గ్రంథంలో తెలియ జేయడం జర్గినది. ఈ గ్రంథానికి మూలం శ్రీ పరాశర సంహిత.

మహాభారతాన్ని ఆబాలగోపాలానికి, పండిత పామర జనులందరికీ అర్థమయ్యే రీతిలో పద్యము, నాటక రూపంలో రచించిన మహానుభావులు శ్రీ తిరుపతి వెంకట కవులు -

బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు - ఎండగండి
బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు - యానాం

వీరు 'తిరుపతి వెంకట కవులుగా' ప్రసిద్ధి చెందినవారు. వీరు పాండవోద్యోగ విజయాలు అనే నాటకంలో శ్రీకృష్ణ రాయబార ఘట్టంలో శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితోనూ, దుర్యోధనునితోను చెప్పిన పద్యం ఈ "జెండా పై కపిరాజు". ఇది చాలా ప్రసిద్ధమైన పద్యం. జెండాపై కపిరాజు అనగా అర్జునుని జెండాపై ఆంజనేయస్వామి అని అర్థం. ఈ గ్రంథమునకు ఆ పేరు పెట్టడం జరిగినది. ఈ కథ కొంతమందికి తెలిసి

ఉండవచ్చు గానీ చాలా మందికి తెలియదు. అందుచేత వ్రాసి అందరికీ తెలియచేయాలనే ఉద్దేశ్యంతో, శ్రీ ఆంజనేయస్వామి వారి అనుగ్రహం అందరికీ కలగాలనే ఉద్దేశ్యంతో, ఈ అంశాన్ని ఎంచుకోవడం జరిగినది. మా పితామహులు (తాతగారు) బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి బుచ్చి రామశాస్త్రిగారు వ్రాసిన ప్రాచీన సంస్కృత శ్లోక లిఖిత ప్రతి లభించినది. దానిని తెలుగులో అనువదించి, శ్లోక, తాత్పర్య సహితంగా వెలువరించు చున్నాను. తాతగారు సికింద్రాబాదులో 1974 సం॥రంలో శ్రీహనుమ ద్భగవద్గీతా భాష్యము పురాణ ప్రవచనం చేసినారు. ఆ పేపరు కూడా ఈ గ్రంథములో ప్రచురించుచున్నాను. (దానితో పాటు 2 సంస్కృత పేపర్లు కూడా పాఠకులకు తెలియపరచు నిమిత్తం ఈ గ్రంథంలో ముద్రణ చేయుచున్నాను.)

మరొక ముఖ్య విషయమేమంటే శ్రీ ఆంజనేయస్వామివారు జెండాపై ఉండగా కురుక్షేత్ర మహాసంగ్రామం ఆరంభంలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు భగవద్గీతను ఉపదేశం చేసినారు. అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మతో "నాకు సరిగా బోధపడలేదు, మరల భగవద్గీతను వివరంగా చెప్పు" మనగా ఆంజనేయస్వామి జెండాపై నుంచి 'నాకు భగవద్గీత అంతయూ బాగుగా తెలిసినది. నీకు తరువాత చెప్పగలను' అనగా అపుడు శ్రీకృష్ణపరమాత్మ ఆంజనేయస్వామితో నాయనా ఆంజనేయా! నీవు బుద్ధిమంతుడివి. నా అనుమతి లేనిదే బ్రహ్మవిద్య ఐన భగవద్గీతను ఎట్లు గ్రహించితివి. నా అనుమతి లేకుండా నీవు గ్రహించావు కనుక నీకు పిశాచత్వం వస్తుంది. అనగా ఆంజనేయుడు శ్రీకృష్ణపరమాత్మను నాకు ఈ పిశాచత్వం ఎలా పోతుంది అని అడుగగా నీవు కురుక్షేత్ర యుద్ధం అయిన తరువాత రామేశ్వరం వెళ్ళి సేతుస్నానం చేసి రామేశ్వరుని పూజించి, భగవద్గీతకు భాష్యం వ్రాసి పిశాచత్వమును పోగొట్టుకోమని చెప్పగా శ్రీఆంజనేయస్వామి రామేశ్వరం వెళ్ళి సేతుస్నానం చేసి బ్రహ్మహత్యను పోగొట్టేటటువంటి రామేశ్వరుని

పూజించి, భగవద్గీతకు భాష్యం వ్రాసి పిశాచత్వాన్ని పోగొట్టుకొనెను. శ్రీహనుమంతుడు పిశాచరూపంలో వ్రాసిన భాష్యం కనుక దీనికి శ్రీమత్ హనుమద్విరచిత పైశాచభాష్యం అని పేరు వచ్చెను.

విజ్ఞులైన పాఠకులు ఈ గ్రంథంలో భ్రమ ప్రమాదముల వల్ల ఏర్పడిన దోషములను, అక్షరదోషములను, అర్ధ దోషములను, సహృదయముతో మన్నింతురని, నాకు తెలిపిన సవరణ చేసుకోగలనని సవినయముగా ప్రార్థించుచూ, ఎంతోమంది పీఠాధిపతులు, పండితులు, సాహితీవేత్తలు, ఆడిటర్లు, వైద్యులు, న్యాయవాదులు, ఇంజనీర్లు, పారిశ్రామిక వేత్తలు, మహిళామతల్లులు అన్ని రంగముల వారు నేను వ్రాసిన గ్రంథములను అభిమానించుచూ, ఆదరిస్తూ, ప్రోత్సహిస్తు న్నందుకు అందరకూ నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలియ చేసుకుంటూ అందరకు శ్రీ సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, హనుమత్సమేత శ్రీరామచంద్రమూర్తి అనుగ్రహం - శ్రీ కృష్ణ పరమాత్మ అనుగ్రహం కలగాలని ప్రార్థిస్తూ శ్రీహనుమంతుడు రచించిన శ్రీ సీతారామస్తోత్రమును కూడా తాత్పర్య సహితంగా వ్రాయడం జరిగినది ఈ సీతారామస్తోత్రమును పఠించిన వారికి అన్యోన్య దాంపత్యం, మరియు సకల సంపదలు కల్గుతాయని తెలియచేయుచూ-

మీ

**గుళ్ళపల్లి వేంకట నాగ శ్రీరామ శర్మ**

# आनन्दाश्रमसंस्कृतग्रन्थावलिः ।

ग्रन्थाङ्कः ४४

वेदव्यासप्रणीतमहाभारतान्तर्गता

# श्रीमद्भगवद्गीता ।

श्रीमद्धनुमद्विरचितपैशाचभाष्यसहिता ।

एतत्पुस्तकम्

वे० शा० रा० "काशीनाथशास्त्री आगाशे" इत्यतः,

तथा वे० शा० रा० "बाबाशास्त्री फडके"

इत्येतैश्च संशोधितम् ।

तच्च

बी० ए० इत्युपपदधारिणा

## विनायक गणेश आपटे

इत्यनेन

पुण्याख्यपत्तने

श्रीमन् 'महादेव चिमणाजी आपटे' इत्यभिधेय-

महाभागप्रतिष्ठापिते

## आनन्दाश्रममुद्रणालये

आयसाक्षरैर्मुद्रयित्वा

प्रकाशितम् ।

द्वितीयेयमङ्कनावृत्तिः ।

शालिवाहनशकाब्दाः १८५५

खिस्ताब्दाः १९३३



मूल्यं सार्धो रूपकः ( १॥८ ) ।

ॐ तत्सद्ब्रह्मणे नमः ।

हनुमद्विरचितपैशाचभाष्यसहिता

# श्रीमद्भगवद्गीता ।

( तत्र प्रथमोऽध्यायः । )

* सर्वं रसं गूढ(ाविद्धरासमो नागामराविगरविं शमन्तरा ।
वेलासरस्तीरकराजहंसः श्लोकामृतं सप्तशतेन पूरितम् ॥ १ ॥
(= प्रपन्नपारिजातायं तोत्रवेत्रैकपाणये ।
ज्ञानमुद्राय कृष्णाय गीतामृतदुहे नमः ॥ २ ॥
करकमलनिदर्शितात्ममुद्रः परिकलितोन्नतबर्हिबर्हचूडः ।
× इतरकरगृहीतवेत्रतोत्रो मम हृदि संनिविशतनोतु शौरिः ॥ ३ ॥
सारथ्यमर्जुनस्याऽऽदौ कुर्वन्गीतामृतं ददौ ।
लोकत्रयोपकाराय तस्मै कृष्णात्मने नमः ॥ ४ ॥

---

* एतच्छ्लोकव्याख्या ख. पुस्तके टिप्पण्यां वर्तते. सा यथा—" तत्रभगवानञ्जनीसूनुः श्रीभगवद्गीताभाष्यमारभमाणस्तदुद्भूतस्वश्रद्धातिशयेन तदुत्कर्षं व्यञ्जयति—सर्वमिति । अहं गूढरविद्धरासमो वेलासरस्तीरकराजहंसोऽपि सप्तशतेन पूरितं श्लोकामृतमन्तरा सर्वं रसमराविगरविं शं नागामित्यन्वयः । तमनु पदव्याख्या=गूढं यथा भवति तथा रेणामिना लङ्कादहनेनेति यावत् । विद्धः सरात्मी( त्रासी )कृतो रासभो रावणो येन स तथा । वेलाविशिष्टं सरः समुद्रस्तत्तीरकराजहंसः । स च ( समुद्र ) पारावारगामी । ईदगुत्कृतकर्मणा प्रभुमाराधितवानपीति भावः । सप्तगुणितं शतं तेन पूरितं तत्परिमितं श्लोकाभिन्नममृतं भगवच्छ्रीकृष्णमुखनिर्गतमन्तरा विना सर्वं रसमानन्द[ मात्ररूप ]म् । ' एतस्यैवाऽऽनन्दस्यान्यानि भूतानि मात्रामुपजीवन्ति ' इत्यादिश्रुतेः । अराणां तत्सदृशनाडीनां वेगो यस्मात्तदभिन्नं रविम् । अत्र मूलं श्रुतिद्वयं यथा–'अरा इव रथनाभौ संहता यत्र नाड्यः स एषोऽन्तश्चरते बहुधा जायमानः ।

" सूर्यो यथा सर्वलोकस्य चक्षुर्न लिप्यते चाक्षुषैर्बाह्यदोषैः ।
एकस्तथा सर्वभूतान्तरात्मा न लिप्यते लोकदुःखेन बाह्यः ' ॥

एतादृशं [ शं ] वेदान्तैकवेद्यं सुखं नागां न प्राप्तमनेन तु प्राप्तमतः परमोत्कृष्टमेतद्व्याख्यायत इति भावः । एतदर्थं[ व्यञ्ज ]कं नाम व्याख्यानं श्रीरामकृष्णविदुषा कृतम् " । इति ।

=धनुश्चिह्नान्तर्गतो ग्रन्थो ग. पुस्तके नास्ति । × इतरकरगृहीततोत्रवेत्र इति युक्तं पठितुम् ।

---

१ घ. 'य वेत्रत्रोत्रै' ।



SankaraBhaghavadacharya Paramaaragatha Moolamnya Sarvagnapeetha
His Holiness Sri Kanchi Kamakoti Peethadhipathi

## Jadadguru Sri Sankarachaya Swamigal

Srimatam Samsthanam
No.1, Salai Street, KANCHIPURAM - 631 502



ఆంజనేయ స్వామివారి చరిత్రను తెలుసుకొనుటకై పరాశర సంహిత ముఖ్యమైన ఆధారము. ఆ గ్రంథములోని విశేషాంశము లను పొందుపరచి తెలుగులో అనువదించి పాఠకులైన భక్తజనులకు అందించారు బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి వేంకటనాగ శ్రీరామశర్మ అవధాని గారు. అంతేకాక ప్రతినిత్యం పఠించవలసిన హనుమంతుని ప్రార్థనాశ్లోకములను ఎన్నిటినో సంకలనం చేసి ఏకత్రీకరించుట అనేది అభినందనీయం.

ఈ విధమైన గ్రంథరచనద్వారా దైవభక్తిని పెంపొందించుచూ శ్రీరామశర్మగారు శ్రీమహాత్రిపురసుందరి సమేత శ్రీ చంద్రమౌళీశ్వర స్వామి కృపాకటాక్షము వలన నిరంతరంగా ధర్మ ప్రచారం సాగించ గలరని సర్వత్ర విజయం కలుగవలెనని ఆశీర్వదిస్తున్నాము.

**నారాయణస్మృతిః**



With the Divine Blessings of His Holiness

JAGADGURU SANKARACHARYA

SRI SRI SRI SWAROOPANANDENDRA SARASWATI MAHASWAMY

VISAKHA SRI SARADA PEETHAM

PENDURTI



# శ్రీముఖం

తేది. 04-05-2011

క్యాంపు: విశాఖపట్నం.

బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి వేంకట నాగశ్రీరామశర్మ అవధానిగారికి,

ఆర్యా!

మీరు సంస్కృతంలో పరాశరసంహితలో ఉన్న శ్రీఆంజనేయస్వామి అర్జునుని "జెండాపై కపిరాజు" గా ఎందుకు ఉన్నారన్న విషయాన్ని, శ్రీ ఆంజనేయస్వామిని గురించిన మరిన్ని విషయాలను వివరంగా వ్రాసిన అనువాదప్రతిని విశాఖ శ్రీ శారదా పీఠాధిపతులు జగద్గురు శంకరాచార్య శ్రీ శ్రీ శ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీస్వామివారి పాదపద్మముల సమక్షమున ఉంచినాము. వారు గ్రంథమును పరిశీలించినారు. తమ అనువాదము చాలా బాగున్నదని, తమరు చేయుచున్న ప్రయత్నము ఆనందదాయకమని మీరు ముందు ముందు మరిన్ని పవిత్రగ్రంథాలు రచించాలని శ్రీస్వామివారు ఆశీర్వదించినారు. అలాంటి శక్తి తమకు కలుగజేయాలని తమకు, తమ కుటుంబానికి శ్రేయస్సు కలగాలని శ్రీస్వామివారు శ్రీ శారదా చంద్రమౌళీశ్వరులను ప్రార్థించినారు.

ఆశీర్వచనములతో మంత్రాక్షతలు పంపుతున్నాము.

ఇట్లు,

పి.ఆర్.ఒ

విశాఖ శ్రీ శారదాపీఠం



# శ్రీపీఠం

రమణయ్య పేట, కాకినాడ.



శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద
సరస్వతి స్వామి

## అసాధ్యసాధక స్వామిన్!

భారతీయ సాంప్రదాయాన్ని ఏదో పైపైగా పరిశీలిస్తే అన్నీ పరస్పర వైరుధ్యాలుగాను, పొంతనలేనివిగాను కనిపిస్తాయి. కానీ, ఈ సాంప్రదాయాన్ని లోతుగా విచారించి, వివరించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

ప్రధానంగా ఈ భారతీయ ఆచారపద్ధతులలో శాస్త్రీయమైన కోణాన్ని పరిశీలించి చూసినట్లయితే, సగుణ నిర్గుణ విభాగాలుగా రెండు అంశాలు ఓ విలక్షణమైన స్థానాన్ని సంతరించుకున్నాయి.

"సగుణం" కేవలం విగ్రహారాధనకే పరిమితమైన అంశం కాదు. కాలేదు కూడా. "గుణేన సవర్తతే ఇతి సగుణః" - రూపము లేకున్నప్పటికీ భావాన్ని ప్రధానంగాను, ప్రమాణంగానూ, పరిగణిస్తాయి ఆగమోక్తములైన శాస్త్రములు.

"మంత్రావై దేవతాః" - మంత్రమే దైవానికి ఉనికి. మంత్రజపముతో దైవత్వ సిద్ధి కలుగుతుంది. "వాచ్యవాచకయోరభేదః" అన్నట్లు మంత్రమే దైవము. దైవమే మంత్రము. ఈ రెండింటినీ విడదీయలేము. అందుకే మంత్రజప అనుష్ఠానమే సర్వశ్రేష్ఠమని చాటిచెప్పిన సాధకుడు హనుమంతుడు. రామ అనే రెండక్షరాలతో తరించిన మహనీయుడు. హనుమంతునిలో ప్రత్యేకమైన అంశములు రెండున్నాయి.



సచ్చిదానంద ఆశ్రమం - తపోవనం- తుని పీఠాధిపతులు శ్రీ **పరమహంస శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద సరస్వతీ స్వామివారు** 'జెండాపై కపిరాజు' గ్రంథమును గురించి వివరించినపుడు వారు దివ్యమైన ఆశీస్సులు అందజేసినారు. వారి పాదపద్మములకు ప్రమాణములు అందజేయుచున్నాను.

1. సాధకులకు మార్గదర్శిగా సర్వోత్కృష్టమైన సాధకుడు.
2. భక్తులకు క్షిప్రసిద్ధిని కలిగించే పరమోత్కృష్టమైన దైవము.

ఈ రెండూ హనుమదవతార వైశిష్ట్యములు. వీటిని సవివరంగా "జెండాపైకపిరాజు" అనే గ్రంథం ద్వారా పరాశరసంహిత నుండి సంగ్రహించిన శ్లోకాలకు చక్కటి అనువాదాన్ని అందించారు బ్రహ్మశ్రీ - శ్రీరామశర్మగారు.

వీరికి వీరి కుటుంబసభ్యులకు శ్రీఐశ్వర్యాంబికాసమేత సుందరేశ్వరుల దివ్య కటాక్షము కలగాలని మంగళాశాసనములు తెలియజేస్తున్నాము.

వైశాఖ శుద్ధ పౌర్ణమి
శంకరజయన్తి 8.5.2011

ఇతిశమ్

**సిహెచ్. సిహెచ్. గణపతి శాస్త్రి**

సామర్లకోట - 533-440,

తూర్పు గోదావరి జిల్లా.

ఆంధ్రప్రదేశ్.

ఫోన్ నెం : (0884)27279,



మహారాజశ్రీ వేదమూర్తులు శ్రీరామ శర్మగారు మన ఆంధ్రదేశానికి ఎంతో ఉన్నతమైన ఉత్తమమైన సవాతన గ్రంథములు అందజేయు చున్నారు. ప్రస్తుతకాలంలో చిన్న స్కూలు నుంచి కాలేజి వరకు పాఠ్యభాగము చాలా చెడ్డగా ఉండి పిల్లలు సనాతన ధర్మాన్ని తెలిసికోలేని దుస్థితిలో ఉన్న తరుణంలో శ్రీ శ్రీరామశర్మ గారి గ్రంథములు అందరికి ఎంతగానో ఉపయోగపడతాయి. శ్రీ శర్మగార్కి - ప్రసన్న ఆంజనేయ స్వామి సర్వదా తోడుగాఉండి స్వామి వారికటాక్షం పరిపూర్ణంగా ఉండాలని స్వామిని ధ్యానించుచు భవిష్యత్తులో స్వామి కటాక్షం చేత ఆయున గ్రంథములు పాఠ్యభాగములు కావాలి అని అమ్మని ధ్యానించుచున్నాను.

చిత్తగించవలెను.

**చంద్రాభట్ల చింతామణి గణపతిశాస్త్రి**

సామర్లకోట

విద్యాలంకార, పరిశోధన ప్రవణ, భాషాప్రవీణ,
రాష్ట్ర ఉత్తమ అధ్యాపక పురస్కార గ్రహీత

**డా. చిఱ్ఱావూరి శివరామకృష్ణ శర్మ**
P.O.L., M.A.(Tel.), M.A.(Skt.), Ph.D., Reader (Retd.)

వేద, వేదాంత, వేదార్థ, వ్యాకరణ,
జ్యోతిష, వాస్తు పండితులు
శ్రీ శృంగేరీ మహాసంస్థాన పురాణ విద్వాంసులు
మోతి నగర్, హైదరాబాద్.



## ఆమోదము

పార్థవీర్య సముద్భూతం హనుమచ్ఛౌర్య సంయుతమ్
శ్రీకృష్ణ చిత్ర చరితం గీతాభాష్యోదయా స్పదమ్.

అతడు మహావీరుడు. మరొకడు కూడా అంతకంటె మహాశూరుడుగా ఉండవచ్చును. ఇతనికి అతని పై ఈర్ష్య ఏల కలుగవలెను. పోనీ, కలిగినది. దానిని అతని ప్రియ భక్తుని దగ్గర ఏల వ్యక్తము చేయవలెను? చేసినచో అతడూరకుండునా? నువ్వెంత? నీ వీర్యత్వమెంతయని కించ పరచడా? తొక్కి సముద్రములో పడవేయడా?

అర్జునుడు మహావీరుడు. శ్రీరాముడు మహాశూరుడు. అతని కీయనపై అసూయ రేగినది. ఆంజనేయుని కడ వ్యక్తము చేసినాడు. వారికి వాగ్వాదము కలిగినది. అది నీవెంత? వరకు వచ్చినది. ప్రాణసంకటము తెచ్చినది.

అర్జునుడు శ్రీకృష్ణ ప్రియుడు. ఆంజనేయుడు శ్రీరామ భక్తుడు. ఈ శ్రీకృష్ణుడు, ఆ శ్రీరాముడు విష్ణుదేవుని అవతారములు ఈభక్తుల కిద్దరకు సయోధ్య చేకూర్చుట ఆయన వంతయినది.

ఆ మాటకారి ఏ మాటల గారడి చేయునో! ఏ భక్తుని పాదముల క్రింద నలుగునో! ఎన్నో తంటాలనుపడి ఈ భక్తునికి ఆ భక్తుని సహకారిగా చేసినాడు. ఇలా అర్జునా ఆంజనేయ స్పర్ధ వల్ల హనుమ జెండా పై కపిరాజైనాడు. ఎట్లయినాడో గ్రంథము లోపలి పుటలలో చూడవలసినదే.

గురువు ఉపదేశించు చున్నాడు. శిష్యుడు వినుచున్నాడు. ఆ గురువే ఆ కపిని ఈ జెండా పై కూర్చుండ బెట్టినాడు. ఆ ఉపదేశ మితనికి వినబడదా! మంచిమాట వినబడినచో చెవులు మూసుకోవలెనా? విశ్వరూపము కనబడినచో కనులు మూయవలెనా? నీవునా అనుమతి లేకుండా వింటివి కనుక పిశాచము కమ్మని గురువు శపించినాడు. ఇదేమి న్యాయమని జెండాపై కపిరాజు ప్రశ్నించగా గీతకొక భాష్యము వ్రాసినచో నీకు శాప విముక్తి కలుగునని గురువు అనుగ్రహించినాడు. శపించనేల? అనుగ్రహించనేల? ఏమైన నేమి! శ్రీ శంకర భాష్యము కంటే ముందే శంకర భాష్యము వంటి హనుమద్భాష్యము భగవద్గీతకేర్పడినది. ఆ హనుమ ఈ శంకరాచార్యులు ఒకే శంకరుని అవతారములు.

ఈ రెండు కథలను మనకు కానుకచేసినది పరాశర సంహిత. ఆ కథలకు తాత్పర్యమును, వాటి సరసన కొన్ని విశేషములను చేర్చి దీనికి అంతమైన జాకెట్టు తొడిగి అందుకోండని పాణిగ్రహణము చేయించిన వారు వేద పండితులు హిందీ విశారదులు బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి శ్రీరామశర్మగారు.

వీరికిదో సరదా! ఇట్టి సరదాల వల్ల జ్ఞానామోదము వ్యాపించును. కీర్తి పరిమళించును. కాని పెక్కు పాట్లు తప్పవు. పాటు పడనిచో ఏది కలుగును? శ్రమకు తగిన ఫలము దొరికినపుడు శ్రమకు వెరచుట ఏల?

ఇంద్రాంశ సంభూతుడు అర్జునుడు. శివాంశ సంభూతుడు హనుమ. ఇక శ్రీ కృష్ణుడు విష్ణువే. వీరి రహస్య చిత్ర చరిత్రమును వెల్లడి చేసినచో వారి ఆశీస్సులు లభింపవా! వారి పుష్కలాశీస్సుల కంటే వీరికి, పఠితలకు కోరదగిన వేమున్నవి.

కాన వీరింకను ఇట్టి పాటులు పడవలెనని, వీరి వల్ల ఇందరకు ఇట్టి లాభము సమకూర వలెనని కోరుట తప్పేమి? ఒప్పేకదా!

స్వస్తి.

హైదరాబాదు — డా॥ చిఱ్ఱావూరి శివరామకృష్ణ శర్మ

ది. 29-03-2011

వేదభాష్యవిభూషణ, ఉభయభాషాశతావధాని,
శ్రీరామయణతత్త్వజ్ఞ, శాస్త్రవిద్వన్మణి
సాంగవేదాచార్య

**డా॥ చిఱ్ఱావూరి శ్రీరామశర్మ**

టీచర్స్‌కాలనీ, రాజమండ్రి - 533105.



## అభినందన - ఆకాంక్ష

శ్రీరామ పాదసేవాపరుడైన హనుమంతుని వైశిష్ట్యాన్ని-శ్రీకృష్ణ పరమాత్మ యొక్క భక్తరక్షణపరాయణతను ప్రకటింపజేస్తూ- శ్రీరామ, శ్రీకృష్ణుల అభేదాన్ని, అట్లే శ్రీరామాయణ-శ్రీమద్భారతగాథ సమన్వయమును చూపించిన పరాశర సంహితాంతర్గత గాథ- ఈ జెండాపైకపిరాజు.

బ్రహ్మశ్రీ గు.నా. శ్రీరామశర్మగారు వేదము నధ్యయనము చేసి సాహిత్యము నందు పరిశ్రమించి ఇప్పటికే - సుభాషిత సంగ్రహము - భారత సావిత్రి - మానవధర్మాలు - చమత్కార చంద్రిక - ఇత్యాదిగా అనేక గ్రంథ సంపుటములను ప్రకాశింపజేసి సంస్కృత వాఙ్మయములలోగల అనేక రహస్యములను ప్రకాశింపజేసి ప్రకృతములో - ఈ జెండాపై కపిరాజును గూడ సర్వులకు తెలియునట్లుగా తెలుగు అనువాదమును జోడించి ప్రకాశింపజేయుచున్నందుకు ఆనందము కలుగుచున్నది. "క్రియాశీలం న విముంచతి శ్రీః" నిరంతరము ప్రయోజనవంతమైన కర్మను ఆచరించేవానిని 'శ్రీ' విడవదు అని సూక్తి చెప్పినట్లుగా నిరంతర క్రియాశీలురగు ఈ గు. శ్రీరామశర్మగారు ఇంచుమించుగా సంవత్సరమున కొకమారు ఇట్టి ఫలాన్ని లోకాని కందిస్తున్నారు.

కులశీల విద్యావయోద్రవిడ ధామములకు లోటులేనివారు అయిన శ్రీరామశర్మ గారు నిరంతరకృషితో ఇట్టి గ్రంథములను లోకమునకు ప్రామాణికముగా అందించే ప్రయత్నము చేయుచున్నందున వీరికృతి జనబాహళ్యములో ప్రవేశించి జ్ఞానమును ప్రబోధిస్తూ, సర్వదా సఫలము కావాలని ఆకాంక్షిస్తూ, ఆస్తికులెల్లరు ఇట్టి తత్త్వములను ప్రామాణికముగా తెలిసికొందురుగాక- అని ఆశిస్తూ శ్రీశర్మగారికి అభినందనలందజేస్తూ స్వస్తి.

ఇట్లు
భవదీయుడు
**డా॥ చిఱ్ఱావూరి శ్రీరామశర్మ**

**Dr. Annadanam Chidambara Sastry**
M.A., & M.A., Ph.D.,
Editor, Sanatana Dharmajyoti Magzine,
Res: Sri Hanumannilayam, Munipallevari Veedhi,
Sana Bazar, CHIRALA - 523 155(A.P)



# కపిధ్వజప్రభ

జెండాపై కపిరాజు అర్జునుని రథపుటెక్కమున నుండియే అసాధారణపాత్ర నిర్వహించాడు. కౌరవసేన అంతగా వినాశనం పొందటానికి కారణం మా జెండాపై కపిరాజే. ఆ రహస్యాన్ని తిక్కన మహాశయుడు "కపిధ్వజప్రభలు నందీభూతులనే జేయవే" అని బయట పెట్టాడు. సువర్చలపతి అయిన హనుమంతుని శక్తి సువర్చస్సు. అట్టివర్చస్సుతో జెండాపై నుండి కౌరవసేన కళ్ళు బైర్లు కమ్మినట్టు చేసినందున వారు అంధీభూతులై యుద్ధమే చేయలేక అనాయసంగా సంహరింపబడ్డారు. తిరుపతి వేంకటకవులు కురుక్షేత్ర విజయాన్ని సూచిస్తూ మూడు కారణాలు చెప్పించారు. అది విజయకారణక్రమం. అందు మొదటికారణమే జెండాపై కపిరాజు. రెండవ కారణం తాను దండంబుగొని తోలటం; మూడవ కారణం గాండీవం ధరించి ఫల్గుణుడు మూకను చెండటం. అలా ధర్మవిజయంలో జెండాపై నుండే కపిరాజు ప్రధానపాత్ర పోషించాడు.

రణరంగంలో శ్రీకృష్ణుని గీతోపదేశాన్ని ముగ్గురూ ఏకకాలంలో విన్నారు. ప్రత్యక్షంగా విన్నవాడర్జునుడు. కాగా పరోక్షంగా విన్నవారిర్వురు. ఒకడు సంజయుడు. కృష్ణ ద్వైపాయనుని అనుమతి ఉన్నవాడు. రెండవవాడు అనుమతి లేని హనుమంతుడు. కాని వీరిలో శ్రద్ధగా విన్నవాడు, బాగుగా అర్థంచేసికొన్నవాడు హనుమంతుడే. అందుకే త్యాగరాజు సురటిరాగంలో కీర్తనవ్రాస్తూ గీతార్థము , సంగీతానందము.... వాతాత్మజునకు బాగా తెలుసురా అంటాడు. చాలామందికి తెలియనిదీ చరిత్ర.

రచయిత బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి వెంకటనాగశ్రీరామశర్మ అవధానిగారు ఈ 'జెండాపైకపిరాజు' గ్రంథంలో విషయాన్ని సమగ్రంగా అందించారు. అంతేకాదు ప్రామాణికతకై సంస్కృతమూలము నందించి పాఠకులకు మహోపకారం చేశారు. తాత్పర్యము సరళసుందరంగా ఆబాల గోపాలానికి అందుబాటులో నుండునట్లందించారు. పితామహులయెడ భక్తితో కేవలం సంకల్పిత గ్రంథభాగ



**శ్రీ పాలేశ్వర స్వామి, ఇరగవరం**

**బ్రహ్మ మురారి సురార్చిత లింగం**
**నిర్మల భాసిత శోభిత లింగం**
**జన్మజ దుఃఖ వినాశక లింగం**
**తత్ప్రణమామి సదాశివలింగం**

మాత్రమునకు పరిమితంకాక హనుమత్సంబంధమయిన ముఖ్య విషయములు, ప్రార్థనాశ్లోకములు అందించుట ద్వారా హనుమద్భక్తులకు మహోపకారం చేసినవారయ్యారు.

శ్రీ హనుమంతునకు సంబంధించిన మంచి విషయాన్ని మరుగున ఉన్న విషయాన్ని పాఠకుల కందించి ఆధ్యాత్మికరంగానికెంతో మేలుచేసిన శ్రీ గుళ్లపల్లి వెంకటనాగశ్రీరామశర్మ గారిచే మరిన్ని మంచిరచనలు చేయించుటకు కావలసిన ఆయురారోగ్య భాగ్యములితోధికంగా ఈయగలందుకు శ్రీహనుమత్ప్రభువు నర్థిస్తున్నాను.

ఇట్లు
సుజన విధేయుడు
**అన్నదానం చిదంబరశాస్త్రి**



డా॥ పెండ్యాల ఉమామహేశ్వరావు
శ్రీ ఉమాచాముండేశ్వరీ పీఠం
అనపర్తి

# అభినందనలు

ప॥గో॥జిల్లా ఇరగవరం గ్రామ నివాసి ఐన విద్వాన్ బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి వేంకట నాగ శ్రీరామశర్మ అవధానిగారు ఎంతో సహృదయులు, మరియు సౌమ్యులు, నిరాడంబరతతో కూడిన సేవాతత్పరులు. వేదవిద్యాపారంగతులైన అవధానిగారు వ్రాసిన గ్రంథరాజములు -

సుభాషితసంగ్రహము, భారతసావిత్రి
మానవధర్మాలు , చమత్కార చంద్రిక;
శ్రీకేశవస్వామిదివ్య చరిత్ర

వంటి గ్రంథములు సంఘములో ఎంతో ప్రజాదరణ పొందినవి అనుటలో ఏమీ సందేహము లేదు.

సంస్కృత భాషలో ఎంతో పరిజ్ఞానం కల్గిన శ్రీశర్మగారు మంచిభాషాపటిమతో తనకున్న పరిజ్ఞానంతో, దైవానుగ్రహంతో, వారి తల్లితండ్రుల, గురువుల ఆశీస్సులతో పదిమందికీ ఎన్నో ఆసక్తికరమైన మన భారతీయ పురాణేతిహాస ములలో యున్న విషయములను సేకరించి పుస్తకరూపంలో ప్రచురించి ప్రజానీకమునకు ఉచితముగా అందించడమన్నది ఎంతో సంస్కారంతో కూడిన ప్రక్రియ. వీరిని వీరి కుటుంబమును జగన్మాత ఐన ఆ పరమేశ్వరి ఆయురారోగ్య ఐశ్వర్యములతో చల్లగా చూస్తూ మరెన్నో సద్గ్రంథాలను వ్రాసే శక్తి ప్రసాదించాలని ప్రార్థిస్తూ, వీరు చేసే కృషిని అభినందిస్తూ శ్రీరామశర్మగారికి శ్రీఉమాచాముండేశ్వరి పీఠం తరపున “కవితావిశారద” బిరుదును ప్రదానం చేస్తున్నాము.

ఇట్లు
భవదీయుడు
**డా॥ పెండ్యాల ఉమామహేశ్వరావు**

మహామహోపాధ్యాయ, శాస్త్ర రత్నాకర, శాస్త్రనిధి,
శాస్త్రమహోదధి, శాస్త్ర విద్వన్మణి, విద్యా వాచస్పతి

**విశ్వనాథ గోపాలకృష్ణ శాస్త్రి,** ఎమ్.ఎ.

న్యాయ వ్యాకరణ విద్యాప్రవీణ,
రిటైర్డ్ ప్రిన్సిపాల్
శ్రీ గౌతమి విద్యాపీఠం, రాజమండ్రి.



బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి వెంకటనాగశ్రీరామశర్మ అవధానిగారు స్వాధ్యాయ సంపన్నులు. సంస్కృతాంధ్ర భాషాభిజ్ఞులు, విద్వత్పౌరాణికులు. పితృపితామహ పరంపరాగతమగు పౌరాణిక విజ్ఞానము, స్వధర్మ నిష్ఠతో అలరారే వీరికి సమాజహిత కామనతో గ్రంథరచన యందాసక్తి కలుగుట ఆనందదాయకం. సంస్కృత భాషలో కల అమూల్యమయిన విషయములను తేటతెలుగులో అందరికీ అర్థమగు రీతిని చిన్నచిన్న గ్రంథములుగా అందిస్తున్న వీరి కృషి అభినందనీయం.

ప్రస్తుతం జెండాపై కపిరాజు అను ఈ గ్రంథము పరాశర సంహితలోని రెండు చిన్న కథలను మనకు వివరిస్తోంది. పురాణగాథలు మానవలోకానికి మంచి ఉపదేశాలు అందిస్తాయి. దుర్గుణాలను దూరం చేయాలని సూచిస్తాయి. ఎంతటివారికైనా గర్వం అనర్థదాయకం. భగవత్కృప విజయహేతువు. కావున ఎల్లరూ అహంకారాన్ని పోగొట్టుకొని భగవంతుని కృపకు పాత్రులయి తరించాలి- అనే ఉపదేశం ఈ కథల వలన మనకు అవగతమవుతుంది. ఆంధ్ర పాఠకులీ గ్రంథాన్ని ఆదరిస్తారని నమ్ముతూ, గ్రంథకర్తకు మరిన్ని గ్రంథాలు రచించే శక్తి యుక్తులు ప్రసాదించాలని సర్వేశ్వరుని స్మరిస్తున్నాను.

గ్రంథకర్తను మనఃపూర్వకంగా అభినందిస్తూ

విద్వజ్జన విధేయుడు

**విశ్వనాథ గోపాలకృష్ణశాస్త్రి**

**తంగిరాల శ్రీరామచంద్ర ప్రసాద్** బి.యస్‌సి.,
ఇరగవరం



# అభిప్రాయం

**సిద్ధింమే సంవిధాస్యంతి దేవాస్సర్షిగణాస్త్విహ**
**బ్రహ్మా స్వయంభూ ర్భగవాన్ దేవాశ్చైవదిశంతుమే**

తన ఆరాధ్య దైవములయిన సీతారామలక్ష్మణులను ధ్యానించి సీతాన్వేషణ సమయములో కార్యసిద్ధి పొందిన ఆంజనేయస్వామి - ఆంజనేయస్వామిని ప్రసన్నుని చేసికొని తన ధ్వజముపై ఉండేటట్లు వరము పొంది కురు సంగ్రామములో విజయం సాధించిన కపిధ్వజుడుగా, విజయునిగా సార్థకత పొందిన అర్జునుడు - వీరిరువురి మధ్య జరిగిన సన్నివేశములను పరాశర సంహిత నుండి గ్రహించి తాత్పర్య సహితముగా "జెండాపై కపిరాజు" పుస్తకముగా వెలువరించిన శ్రీ గుళ్ళపల్లి నాగ శ్రీరామశర్మగారు అభినందనీయులు. వీరు వెలువరించిన ఈ పుస్తకములో ప్రధానంగా రెండు అంశములు వెలుగుకు వచ్చినవి.

1. అర్జునుడు తన ధ్వజంపై ఆంజనేయస్వామిని ప్రతిష్ఠించుకునే వరం పొందుటకు ప్రేరణభూతమయిన శరపంజరభేదన ఘట్టం

2. శ్రీమద్భగవద్గీతకు శ్రీమద్ధనుమద్విరచిత పైశాచభాష్యం ఆవిర్భవించుటకు దారితీసిన ఘట్టం - ఈ రెండు ఘట్టములు అపూర్వమయినవి, జనబాహుళ్యంలో ప్రచారంలో లేనివి. వీటిని పుస్తక రూపములో ముద్రించి ప్రజలకు అందించిన శ్రీశర్మగారి కృషి శ్లాఘనీయం.

శ్రీశర్మగారు మరిన్ని అపూర్వ విషయములను సేకరించి జనానికి అందుబాటు లోనికి తీసికొని వచ్చే ఈ కృషికి ఇరగవరం గ్రామంలో స్వయమావిర్భూతులై విలసిల్లు శ్రీ ఉమాపాలేశ్వరస్వామి అనుగ్రహం కలగాలని ప్రార్థన.

ఇట్లు
భవదీయుడు
**తంగిరాల శ్రీరామచంద్రప్రసాద్.**



## 'గురు'బాలు ఆశీఃస్సులు

శతేషు జాయతే శూరః
సహస్రేషు చ పండితః

అన్నారు పెద్దలు. 'నానృుషిః కురుతే కావ్యం'. నిత్య కృషీవలత్వంతో విద్యామతల్లి అనుగ్రహంతో పొత్తము వెంట పొత్తం వెలువరిస్తూ శతధనుప్రహారం చేసే రుద్రమూర్తిలా శరపరంపరగా తన కావ్య అవధానంతో సుభాషితాలు, భారతసావిత్రి, మానవ ధర్మాలు, చమత్కార చంద్రికలను వెలుగుల తేజిలుగా విరజిమ్మి "అంజన కన్న భాగ్యశాలి, వాయుపుత్రుడు, సుగ్రీవామాత్యుడు, సుషేణ జాంబవంతుల సచివుడు, రామభక్తుడు, సీతారాముల అనుసంధాన దౌత్యం నెరపిన దూత, 'సుందర కాండే' రామాయణంలో శిరోభూషణం అనే సమగ్రత చాటుతూ ఆ మారుతి అన్ని నాడుల అనుసంధానంతో ఆత్మ విద్యతో సముద్రాన్ని లఘించిన బహుముఖ ప్రజ్ఞాశాలి" - అతని చరితా శరం మన విజ్ఞాన లక్ష్యం ఛేదిస్తోంది చూడండి. ఈ కావ్య అవలోకనం చేయండి. మేన అల్లునకు శుభాశీఃస్సులు.

నిడుబ్రోలు

- 'గురు'బాలు

గొర్తి పళ్ళయ్యశర్మ,
బేగం పేట, హైదరాబాద్



## అభినందనలు

బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి వెంకటనాగశ్రీరామశర్మ అవధానిగారికి అభినందనలతో వ్రాయునది. మీరు ఇంతవరకు వ్రాసిన 1. సుభాషిత సంగ్రహం 2. భారతసావిత్రి 3. మానవధర్మాలు 4. చమత్కార చంద్రిక మొదలగు గ్రంథములు తమరు నాకు ఎంతో అభిమానముతో అందజేసినారు. నేను వాటన్నింటినీ ఆమూలాగ్రముగా చదివి ఎంతో అనుభూతిని, ఆనందాన్ని పొంది మా మిత్రులకు అందజేయగా వారు కూడా చదివి ఎంతో సంతోషాన్ని పొందినారు. కొన్ని గ్రంథములను వారికి కూడా తమరు అందజేయమనగా అందజేసినారు. చాలా సంతోషం. సంస్కృతం చదువుకోని మాలాంటివాళ్ళకు ఆ గ్రంథములను చదవటం వలన ఎన్నో విషయాలు, విశేషాలు తెలిసినవి. మీరు ఎంతో శ్రమకోర్చి గ్రంథములను రాసి ఉచితంగా అందరికీ పంచిపెట్టడం అభినందించ తగ్గ విషయం. మీ గ్రంథరచనను అభినందిస్తూ ఒకపాఠకుడిగా ఈ లేఖద్వారా తమకు కృతజ్ఞతాభినందనలను తెలియజేస్తూ మీరు వ్రాసే 'జెండాపైకపిరాజు'ను త్వరలో అందజేయవలసినదిగా కోరుచున్నాను.

ఇట్లు
భవదీయుడు
**గొర్తి పళ్ళయ్యశర్మ**

# కృతజ్ఞతలు

మొదటగ కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీఅలివేలుమంగ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామి వారి పాదపద్మములకు ప్రణమిల్లి,

జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ మహాస్వామివారి పాదపద్మములకు, శ్రీశ్రీశ్రీ శంకర విజయేంద్ర సరస్వతి మహాస్వామివారి పాదపద్మములకు ప్రణమిల్లి-

శ్రీశ్రీశ్రీ విశాఖ శ్రీ శారదా పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీ స్వామివారి పాద పద్మములకు, శ్రీ శ్రీపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామి వారి పాదపద్మములకు-

నా మొదటి గ్రంథమును ముద్రింపించిన (తిరుమల తిరుపతి దేవస్థానం వార్కి)-

శ్రీశ్రీశ్రీ సద్గురు శివానందమూర్తి సద్గురువుల పాదపద్మములకు ప్రణామములు అర్పించి, వారి శిష్యపరమాణువు శ్రీ గెంటేల వెంకటరమణ గార్కి, వారి ధర్మపత్ని శ్రీమతి వసంతలక్ష్మి గార్కి (బలుసుపాడు) నమస్కరించి-

శ్రీ తపోవనం పీఠాధిపతులు శ్రీశ్రీ సచ్చిదానంద సరస్వతీ స్వామివారి పాద పద్మములకు ప్రణమిల్లి, ఉపాసకులు బ్రహ్మశ్రీ చంద్రాభట్ల చింతామణి గణపతి శాస్త్రిగార్కి నమస్కరించి-

నవనిధి ఎలక్ట్రానిక్స్ అధినేత వేదసభానిర్వాహకులు బ్రహ్మశ్రీ యేడిది రామనాథ శాస్త్రిగార్కి, శ్రీమతి వెంకట నాగమణిగారు దంపతులకు- ప్రముఖ హస్తసాముద్రికులు శ్రీ డా॥ మల్లాది లక్ష్మీనారాయణగారు, శ్రీమతి ఇందిరగారు దంపతులకు - శ్రీ శుభగాయత్రీ అధినేత బ్రహ్మశ్రీ భట్లపెనుమర్తి సీతారామారావుగారు, శ్రీమతి సాయికుమారిగారు దంపతులకు- ప్రముఖవైద్యులు, సాహిత్యాభిమానులు, చమత్కార చంద్రిక ముద్రణదాతలు మహారాజశ్రీ డా॥ కర్రి శ్రీనివాసులరెడ్డి గారు, శ్రీమతి డా॥ కర్రి సూర్యప్రభగారు దంపతులకు- ప్రముఖ పారిశ్రామికవేత్తలు, ధార్మికులు శ్రీశారదా పరమేశ్వరి దేవస్థానం గుంటూరు నిర్వాహకులు మహారాజశ్రీ పోలిశెట్టి శ్రీహరి ప్రసాదరావుగార్కి- సాహిత్య ప్రియులు బ్రహ్మశ్రీ చిట్టి సూర్య శ్రీనివాసశర్మగారు, శ్రీమతి శారదగారు దంపతులకు- మహారాజశ్రీ నడింపల్లి జగన్మోహన వర్మ గార్కి

నామీద ఎంతో అభిమానముతో ఆశీస్సులను - అభిప్రాయములను అందజేసిన పండితులు, పెద్దలు -

డా॥ చిఱ్ఱావూరి శ్రీరామశర్మ గార్కి, డా॥ అన్నదానం చిదంబరశాస్త్రిగార్కి,

బ్రహ్మశ్రీ తంగిరాల శ్రీరామచంద్ర ప్రసాద్‌గార్కి, బ్రహ్మశ్రీ విశ్వనాథ గోపాల కృష్ణ శాస్త్రిగార్కి, మ॥రా॥శ్రీ పెండ్యాల ఉమామహేశ్వరరావుగార్కి, శ్రీ 'గురు'బాలు గార్కి, బ్రహ్మశ్రీ గొర్తి పళ్ళయ్య శర్మ గార్కి కృతజ్ఞతలను తెలియజేయుచున్నాను.

ఈ గ్రంథమును ఎంతో ఓపికతో పరిష్కరించిన విద్యాలంకార బ్రహ్మశ్రీ డా॥ చిఱ్ఱావూరి శివరామకృష్ణ శర్మగార్కి ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను.

అడిగిన వెంటనే ఎంతో అందముగా ముఖచిత్రమును చిత్రీకరించిన, ఎన్నో అవార్డులను పొందిన ప్రముఖచిత్రకారుడు మా గ్రామస్తుడు శ్రీ "వెంపటాపు"నకు కృతజ్ఞతలను తెలియజేయుచున్నాను.

ఈ గ్రంథమును ఎంతో అందముగా ముద్రించిన ఆకాష్ అధినేత డా॥ పూషాగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలియజేస్తూ -

మీ

**గుళ్ళపల్లి వెంకట నాగ శ్రీరామశర్మ అవధాని**

మా గ్రామస్తులు కీ.శే. యడవిల్లి రామ్మూర్తి శాస్త్రి గారు సుందరకాండ పారాయణ చేయడంలో ప్రసిద్ధులు. వారు సుందరకాండ పారాయణం ద్వారా ఎంతోమందికి కార్యసిద్ధి కలిగించినారు.

మా గ్రామంలో కీ.శే. పొన్నా శ్రీరామపాలశంకరం గారు శ్రీభక్తాంజనేయ స్వామి వార్ని సుమారు 47 సం॥ములు క్రిందట దేవాలయం కట్టి శ్రీ ఆంజనేయస్వామిని ప్రతిష్ఠించారు. అప్పటినుండి అవిచ్ఛిన్నముగా, నిర్విఘ్నంగా ప్రతి సంవత్సరం వైశాఖమాసంలో హనుమజ్జయంతి సందర్భముగా గ్రామస్తుల, భక్తుల సహాయ సహకారాలతో సప్తాహదీక్షతో (7 రోజులు) ఉత్సవము నిర్వహిస్తున్నారు. చివరి రోజున అన్న సమారాధన చేయుచున్నారు.

# గురుపుణారి దివ్య ఆశీస్సులు



**శ్రీ కందుకూరి శివానంద మూర్తి గారు, భీమిలి**

శ్లో. శివానందస్య చరణౌ సర్వలోక సుపూజితౌ
పాయాస్తాం సర్వదా శుద్ధౌ శ్రీజ్ఞానామృతవర్షిణౌ

తా. సంపద జ్ఞానమనే అమృతమును వర్షించునవి, జనులందరి చేత పూజింపబడునవి, పవిత్రమయినవి అగు శ్రీ శివానందమూర్తి గురువర్యుల పాదపద్మములు ఎల్లప్పుడూ రక్షించుగాక!

## శివాయ గురవే నమః

సాగరతీరమున, భీముని పట్నమున
ఆనందవనమను తపోవనమున
సుందర, సుమధుర, సువాసిత
ఫల పుష్పయుత తరు ఛాయామధ్యమున
మంగళతోరణాచ్ఛాదిత సదనమున
ఆనందమయ ముఖారవిందులగు
'శివశ్రీ' కందుకూరి వీరబసవరాజుగారు
శ్రీమతి సర్వమంగళాంబ పుణ్యదంపతుల
గర్భమున జన్మించిన పుణ్యమూర్తి
శ్రీ శ్రీ శ్రీ సద్గురు శివానందమూర్తి మహోదయ
పాదపద్మములకు
గుళ్ళపల్లి వెంకట నాగశ్రీరామశర్మ నామధేయుడు
సవినయ భక్తి పురస్సర నమస్సుమాంజలులతో సమర్పించినది.





శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు, శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు

శా. జెండాపై కపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబున్‌గొని తోలుస్యందనము మీదన్ నారి సారించుచున్
గాండీవమ్ము ధరించి ఫల్గునుడు మూకన్ జెండుచున్నప్పుడొ
క్కండున్ నీ మొఱలాలకింపడు కురుక్ష్మానాథ! సంధింపగన్

(పాండవోద్యోగ విజయం - శ్రీ తిరుపతి వేంకట కవులు)

## మాతాపితరులు



శ్రీ గుళ్ళపల్లి సీతారామావధాన్లు గారు, శ్రీమతి లక్ష్మీనరసమ్మ గారు

శ్లో॥ తపస్స్వాధ్యాయ నిరతం పాలేశారాధకం సదా
బ్రహ్మవిద్యోపాసకం తం సీతారామగురుం భజే



**శ్రీ వడ్డి వెంకట శాస్త్రి గారు, శ్రీమతి సూరమ్మ గారు**

శ్లో. న్యాయ వేదాంత శాస్త్రాబ్ధి వారిధిం దేశికోత్తమం
వఢ్రి వంశ సముద్భూతం వందే వేంకట శాస్త్రిణం



బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి బుచ్చిరామావధానులు గారు

శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

సికింద్రాబాదు గీతాభవనములో తేది 02-10-1974 (బుధవారం) మొదలు 11-10-1974 (శుక్రవారము) వరకు ప్రతిరోజూ సాయంత్రం గం॥ 6 ల నుండి గం॥ 7-30 ని. వరకు బ్ర॥శ్రీ గుళ్లపల్లి బుచ్చిరామశాస్త్రిగారిచే శ్రీహనుమద్భగవద్గీతా భాష్యప్రవచనము జరుపబడును. కావున భక్తులందరు శ్రవణముచేసి శ్రీభగవానుని అనుగ్రహమునకు పాత్రులగుదురుగాక.

సికింద్రాబాదు　　　　ఇట్లు

30-09-1974.　　　　భక్త బృందము

# ప్రార్థనా శ్లోకములు

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాన్తయే॥

తా. తెల్లని వస్త్రమును ధరించిన వాడును, అంతటనూ వ్యాపించి ఉన్నవాడును చంద్రుని వంటి తెల్లని వర్ణం కల్గినటువంటి వాడునూ, నాల్గుచేతులు కల్గినవాడునూ, నవ్వుతూ ఉండేముఖం కల్గిన వాడునూ, అయిన విఘ్నేశ్వరుని సర్వవిఘ్నునులను శాంతింప చేయుట కొరకు భక్తితో ధ్యానించుచున్నాను.

## శ్రీ గణేశ ద్వాదశ నామాలు

## సంకట నాశన గణేశ స్తోత్రం

శ్లో॥ ప్రణమ్య శిరసా దేవం గౌరీపుత్రం వినాయకం
భక్తావాసం స్మరేన్నిత్యం ఆయుష్కామార్ధ సిద్ధయే
ప్రధమం వక్రతుండం చ ఏకదంతం ద్వితీయకం
తృతీయం కృష్ణ పింగాక్షం గజవక్త్రం చతుర్ధకం
లంబోదరం పంచమంచ షష్ఠం వికటమేవచ
సప్తమం విఘ్నరాజంచ ధూమ్రవర్ణం తధాష్టకం
నవమం ఫాలచంద్రంచ దశమం తు వినాయకం
ఏకాదశం గణపతిం ద్వాదశం తు గజాననం
ద్వాదశైతాని నామాని త్రిసంధ్యం యః పఠేన్నరః
న చ విఘ్నభయం తస్య సర్వసిద్ధి కరం పరం
విద్యార్థీ లభతే విద్యాం ధనార్థీ లభతే ధనం
పుత్రార్థీ లభతే పుత్రా న్మోక్షార్థీ లభతే గతిం
జపే ద్గణపతి స్తోత్రం షడ్భిర్మాసైః ఫలం లభేత్
సంవత్సరేణ సిద్ధిం చ లభతే నాత్ర సంశయః

అష్టానాం బ్రాహ్మణానాం చ లిఖిత్వా య స్సమర్పయేత్
తస్య విద్యా భవే త్సర్వా గణేశస్య ప్రసాదతః॥

శ్లో॥ తొండమునేక దంతమును దోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని జూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ యోయి గణాధిప నీకు మ్రొక్కెదన్

శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీ స్తత్సుతాన్ గురూన్
నత్వా సమస్త ప్రత్యూహ శాంతయే మంగళాయ చ॥

తా. ఈశ్వరుని, విష్ణువుని, బ్రహ్మదేవుని, వారి పత్నులైన పార్వతీదేవిని, లక్ష్మీదేవిని, సరస్వతీ దేవిని, వారి పుత్రులను విద్యలను అభ్యాసము చేయించిన (చెప్పిన) గురువులను సమస్తమైన (ప్రత్యూహ) విఘ్నములను పోగొట్టుట కొఱకు నమస్కరించు చున్నాను.

## సరస్వతీ ప్రార్థన

శ్లో॥ శారదనీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హారతుషారఫేనరజతాచల కాశఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామర సామర వాహినీ శుభా
కారతనొప్పు నిన్ను మదిగానక నెన్నడు కొలుతు భారతీ

శ్లో॥ నమశ్శారదాయై వచస్సారదాయై
నమశ్చేందిరాయై జగన్మందిరాయై
నమస్యాచ్ఛివాయై నిరస్తాఽ శివాయై
నమస్తత్పతిభ్యః త్రిలోకీ పతిభ్యః ॥

తా. వాక్కుల సారమును ప్రసాదించే శారదా దేవి కొఱకు, జగత్తు నివసముగా గల లక్ష్మీదేవికి, అమంగళమును తొలగించు పార్వతీ దేవికి, మూడులోకములకు పాలకులైన సరస్వతీ మహాలక్ష్మీ పార్వతుల భర్తలైన త్రిమూర్తులకు నమస్కారము.

శ్లో॥ **జననీ జానకీ సాక్షాత్ జనకో రఘునందనః**
**లక్ష్మణోమిత్ర మస్మాకం కోవిచారః కుతో భయమ్॥**

తా. జానకీ దేవి నిజముగా మాతల్లి రఘునందనుడు అయిన రాముడు మా తండ్రి మనకు మిత్రుడు లక్ష్మణుడు విచారమెందుకు ఎందువల్ల భయము.

## హనుమంతుని ప్రార్థనా శ్లోకములు

శ్లో॥ **బుద్ధిర్బలం, యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా**
**అజాడ్యం వాక్పటుత్వం, చహనుమత్స్మరణాద్భవేత్**

తా. మంచి బుద్ధియు, బలము, కీర్తి, ధైర్యము, భయము లేకుండుట, రోగములు లేకుండుట, జడత్వము (మందకొడి) లేకుండుట, వాక్చాతుర్యం (మాటకారితనం) హనుమంతుని స్మరించుటవలన వచ్చును.

శ్లో॥ మరుతస్యాత్మజశ్రీమాన్ హనుమన్నామ వానరః
వజ్ర సంహన నోపేతో వైనతేయ సమోజవే
సర్వవానర ముఖ్యేషు బుద్ధిమాన్ బలవానపి
శరణ్యాయ వరేణ్యాయ వాయుపుత్రాయతే నమః

తా. శోభామూర్తియై ప్రకాశించేవాడు వాయుదేవుని కుమారుడు

వజ్రముతో సమానమైన దేహపటుత్వము కలవాడు వేగమున గరుత్మంతునితో సమానమైనవాడు వానరశ్రేష్ఠులందరిలో బహు (చాలా) బుద్ధిమంతుడు మహాబలవంతుడు అగు ఆంజనేయునికి నమస్కారము.

**శ్లో॥ అంజనానందనం వీరం జానకీ శోకనాశనం**
**కపీశమక్షహంతారం వందే లంకాభయంకరం॥**

తా. అంజనాదేవి కుమారుడును, వీరుడను, జానకీదేవి దుఃఖమును పోగొట్టినవాడునూ, కపీశుడును, అక్షకుమారుని వధించినవాడును, లంకానగరమును భయకంపితమొనర్చిన వాడును అగు ఆంజనేయుని నమస్కరించుచున్నాను.

**శ్లో॥ గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసం**
**రామాయణ మహామాలా రత్నం వన్దేఽనిలాత్మజం॥**

.తా. సముద్రమును గోష్పాద జలమువలె భావించి లంఘించిన వాడును, రాక్షసులను దోమవలె సంహరించినవాడును, రామాయణమను మహామాలయందు రత్నమువలె శోభించు వాడును అగు అనిలాత్మజుడైన (వాయు కుమారుడైన) ఆంజనేయునికి నమస్కారములు.

చం॥ అతులతరంగ తుంగ నిలయంబగు అర్ణవమెల్ల గోష్ప
కృతమొనరించువాని, మశకీకృత రాక్షసుడైనవాని స
త్కృతియగు రామగాథయను దివ్యరసంబున రత్నమౌచు
సన్మతి నుతి కెక్కువాని, హనుమంతుద్రలంతు నితాంతభక్తియై.

**శ్లో॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకం**
**తరుణార్క ప్రభం శాంతం రామదూతం నమామ్యహం॥**

.తా. మహావీరుడైనటువంటినీ్న, బ్రహ్మ,విష్ణు,శివ స్వరూపుడై నటువంటినీ్న, మధ్యాహ్నకాలం సూర్యునితో సమానమైన కాంతికలవాడునూ, శాంతుడైన రామదూతయైన ఆంజనేయుని నమస్కరించుచున్నాను.

**శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం! జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం**
**వాతాత్మజం వానరదూతముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి॥**

.తా. మనసుతో సమానమైన వేగముగా సంచరించువాడును, వాయువేగము గలవాడను, జితేంద్రియుడను (ఇంద్రియాలను జయించిన వాడును) బుద్ధిమంతులలో శ్రేష్ఠుడును, వాతాత్మజుడును, వానరయోధులలో ముఖ్యుడును శ్రీరామ దూతయును అగు వాయునందనునకు శిరను వంచి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ యత్రయత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్త కాంజలిం**
**బాష్పవారి పరిపూర్ణ లోచనం మారుతిం నమత రాక్షసాంతకం॥**

తా. ఎచ్చటెచ్చట రామనామము గానము చేయబడుచుండునో అచ్చటచ్చట రెండు చేతులు నెత్తిపై పెట్టుకొని నమస్కరించుచు నేత్రములలో ఆనందబాష్పములు నింపుకొని యుండెడివాడును, రాక్షసులను వధించువాడును అగు మారుతికి వందనములు.

**శ్లో॥ సర్వారిష్ట నివారకం శుభకరం పింగాక్ష మక్షాపహం**
**సీతాన్వేషణ తత్పరం, కపివరం కోటీన్దు సూర్యప్రభం**
**లంకాద్వీప భయంకరం సకలదం సుగ్రీవ సన్మానితం**
**దేవేంద్రాది సమస్త దేవ వినుతం కాకుత్స్థ దూతం భజే**

తా. అన్ని అరిష్టములను (కష్టములను) పోగొట్టి శుభాన్ని కల్గించే వాడు,

పచ్చటి కన్నులు కలవాడు అక్షకుమారుణ్ణి సంహరించినవాడు, సీతాదేవిని అన్వేషించినవాడును, కపులలో (వానరులలో శ్రేష్ఠ డును) కోటి చంద్రులతో, కోటి సూర్యులతో సమానమైన కాన్తి కల్గినవాడును లంకాద్వీపమునకు భయంకరమైనవాడును, అన్నిటినీ ఇచ్చేటటువంటివాడును, సుగ్రీవునిచే సన్మానింప బడినవాడును, దేవేంద్రుడు మొదలగు సమస్త దేవతలచేత స్తుతింపబడినవాడును, కాకుత్థ్స వంశమున పుట్టిన రామ చంద్రునకు దూత ఐనటువంటి ఆంజనేయుని భజించుచున్నాను.

శ్లో॥ **మూర్తిత్రయాత్మకం పీనం మహావీరం మహాహనుం**
**హనూమంతం వాయుపుత్రం నమామి బ్రహ్మచారిణం॥**

శ్లో॥ **త్రిమూర్త్యాత్మక మాత్మస్థం జపాకుసుమ సన్నిభం**
**నానా భూషణ సంయుక్తం ఆంజనేయం నమామ్యహం॥**



శ్లో॥ **వందే వానర నారసింహ ఖగరాట్ క్రోడాశ్వవక్త్రాంచితం**
**నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానంరుచా**
**హస్తాబ్జైరసిఖేట పుస్తక సుధాకుంభం కుశాద్రీన్‌హలం**
**ఖట్వాంగం ఫణి భూరుహం దశభుజం సర్వారిగర్వాపహం**

తా. వానర, నృశింహ, గరుడ, వరాహ, అశ్వముఖములతో కూడినట్టియు, అనేక అలంకారములు కల్గినట్టియు, మూడైదుల నేత్రములు

కల్గినట్టియు, కాంతితో ప్రకాశించునట్టియు, చేతులతో, కత్తి, డాలు, పుస్తకము, అమృత కలశము, అంకుశము, పర్వతమును, నాగలిని, మంచపుకోడును, పామును, చెట్టును,ధరించునట్టియు, గర్వించిన శత్రువులగు రాక్షసులను సంహరించు వానికి నమస్కారము.

శ్లో॥ **అమల కనక వర్ణం ప్రజ్వలత్పావకాక్షం**
**సరసిజనిభ వక్త్రం సర్వదా సుప్రసన్నం**
**పటుతర ఘనగాత్రం కుండలాలంకృతాంగం**
**రణకుజ కరవాలం రామదూతం నమామి**

తా. నిర్మల పద్మశోభితుడును, ప్రజ్వలించే అగ్నివంటి ప్రకాశము కలవాడును, పద్మశోభతో గూడిన ముఖము కలవాడును, సర్వదా సుప్రసన్నుడును, పటుతరమైన గొప్ప దేహము కలవాడును, కోటి సూర్యులతో సమానంగా ప్రకాశించేవాడును, యుద్ధమున జయించు ఖడ్గము(కత్తి)వంటి వాడును, శ్రీరామచంద్రుని దూతయగు ఆంజనేయునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ **హరేరామ హరేరామ రామ రామ హరే హరే**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే**
**ఇతిషోడశకం నామ్నాం కలికల్మష నాశనం**
**నాऽతఃపరతరోపాయం సర్వవేదేషు దృశ్యతే**

తా. 16 నామములు గల ఈ నామములు కలిప్రభావము కలిగిన కలికల్మషములను నాశన మొనరించును. సర్వవేదముల యందును ఇంతకు మించిన ఏ ఉపాయములు కనిపించుట లేదు.

శ్లో॥ అసాధ్య సాధక స్వామిన్ అసాధ్యం కిం వదప్రభో
రామదూతః కృపాసింధో మత్కార్యం సాధయ ప్రభో॥

శ్లో॥ నమస్తే దేవదేవేశ నమస్తే రాక్షసాంతక
నమస్తే వానరాధీశ నమస్తే వాయునందన॥

శ్లో॥ మర్కటేశ మహోత్సాహ సర్వ శోక నివారక
శత్రూన్ సంహర మాం రక్ష శ్రియం దాపయ మే ప్రభో॥

శ్లో॥ నమస్తేస్తు మహావీర నమస్తే వాయునందన
విలోక్య కృపమా నిత్యం త్రాహిమాం భక్త వత్సల॥

శ్లో॥ ఆంజనేయ మతిపాట లాననం కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాన నందనం॥

శ్లో॥ అతులిత బలధామం స్వర్ణశైలాభ దేహం।
దనుజ వన కృశానం జ్ఞానినా మగ్రగణ్యం
సకలగుణ నిధానం వానరాణా మధీశం
రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి॥

శ్లో॥ ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోక వహ్నిం జనకాత్మజాయాః
ఆదాయతేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయం॥

తా. సముద్రము యొక్క ఉదకమును అనాయాసముగా దాటి ఏ హనుమంతుడు సీతాదేవి యొక్క శోకమనే (వహ్ని) అగ్నిని తీసుకొని లంకను తగులబెట్టెనో అటువంటి ఆంజనేయుని దోసిలి కట్టుకున్న వాడినై నమస్కరించుచున్నాను.

**శ్లో॥ దూరీకృత సీతార్తిః ప్రకటీకృత రామ వైభవ స్ఫూర్తిః**
**దారిత దశముఖ కీర్తిః, పురతోమమ భాతు హనుమతో మూర్తిః**

తా. సీతాదేవి ఆర్తిని (దుఃఖాన్ని) పోగొట్టినవాడును, శ్రీరాముని వైభవమును ప్రకటించినవాడును, రావణుని కీర్తిని పోగొట్టినవాడు అగు హనుమంతుడు నా యెదుట ప్రకాశించుగాక.

**శ్లో॥ ఆమిషీకృత మార్తాండం గోష్పదీకృత సాగరం**
**తృణీకృత దశగ్రీవం ఆంజనేయం నమామ్యహం॥**

తా. (సూర్యగోళమును) సూర్యుని తినదగిన పండుగా భావించినవాడునూ, సాగరమును (సముద్రమును) గోష్పాదములోని (గోపాదము) నీటివలె భావించినవాడును, రావణుని తృణప్రాయముగా (గడ్డిపరకగా) తలచినవాడునూ అగు ఆంజనేయుని నమస్కరించుచున్నాను.

**శ్లో॥ యస్తృణీకృత బ్రహ్మాస్త్ర సారస్సర్వ సురార్చితః**
**శౌర్యం సర్వం కష ప్రజ్ఞా స్తం వన్దే వాయునందనం॥**

తా. పరాశరులవారు చెప్పుచున్నారు: ఎవరైతే బ్రహ్మాస్త్రమును గడ్డి పోచగా తలంచిరో, సమస్త దేవతల చేత అర్చింపబడిరో (పూజింపబడిరో), పరాక్రమముచే అన్నిటినీ జయింప గల్గిరో అట్టి వాయునందనుడైన శ్రీఆంజనేయుని నమస్కరించుచున్నాను.

**శ్లో॥ వేద వేదాంగతత్వజ్ఞం, సర్వవిద్యావిశారదం**
**సర్వబ్రహ్మవిదాంశ్రేష్ఠం, సర్వదర్శన సమ్మతం.**

తా. చతుర్వేదములు, షడంగములు, నవవ్యాకరణములు, చతుర్దశ విద్యలు, బ్రహ్మవిద్యయు, షడ్దర్శనములు అన్నియు అభ్యసించిన (చదివిన) మహానుభావుడు, సర్వవిద్యావిశారదుడు, బ్రహ్మాదులలో

శ్రేష్ఠుడు, దర్శనములన్నియు తమ వాదనములచే నంగీకరింప దగినవాడు.

శ్లో॥ ఓం నమః పంచవదనాయ పూర్వముఖే కపిసింహాయ
సకల శత్రు సంహరణాయ హ్రౌం మహాబలాయస్వాహా

ఓం నమః పంచవదనాయ దక్షిణముఖే కరాళనృశింహాయ
క్రౌం సకల భూత ప్రమథనాయస్వాహా

ఓం నమః పంచవదనాయ పశ్చిమముఖే వీర గరుడాయ
క్ర్యోం, సకల విషహరాయస్వాహా

ఓం నమః పంచవదనాయ ఉత్తరముఖే ఆదివరాహాయ
గ్లౌం సకల సంపత్కరాయ స్వాహా

ఓం నమః పంచవదనాయ ఊర్ధ్వముఖే హయగ్రీవాయ
హ్రౌం సకల జన వశీకరణాయస్వాహా

ఓం నమో భగవతే ఆంజనేయాయ మహాబలాయ
హనుమతేస్వాహా ॥

## ఆంజనేయ గాయత్రి

ఆంజనేయాయ విద్మహే వాయుపుత్రాయ ధీమహి
తన్నో హనుమాన్ ప్రచోదయాత్

శ్లో॥ శ్రీరామ హృదయానందం భక్తకల్పమహీరుహం
అభయం వరదందోర్భ్యాం కలయేమారుతాత్మజం

తా. శ్రీరామచంద్రుని హృదయమును సంతోషపెట్టువాడును, భక్తులకు కల్పవృక్షమువంటివాడును, అభయప్రదాతయు, వరములను ఒసగువాడును అగు మరుతాత్మజుడైన ఆంజనేయునికి వందనములు.

శ్లో॥ నమస్తే సదాబ్రహ్మచర్యాయ తుభ్యం
నమస్తే సదా వాయుపుత్రాయతుభ్యం
నమస్తే సదా పింగళాక్షాయతుభ్యం
నమస్తే సదా రామభక్తాయతుభ్యం

శ్లో॥ జరాభారతో భూరి పీడాంశరీరే
నిరాధారణారూఢగాఢ ప్రతాపీ
భవత్పాదభక్తిం భవద్భక్తిరక్తిం
కురుశ్రీహనూమత్ప్రభోమేదయాళో॥

శ్లో॥ ప్రదోషేవా ప్రభాతేవా యేస్మరంత్యంజనాసుతం
అర్థసిద్ధిం, జయం, కీర్తిం ప్రాప్నువంతినసంశయః

తా. సాయంకాలమందు-ఉదయవేళలందు ఎవరు అంజనాసుతుడైన ఆంజనేయుని స్మరిస్తారో వారు కార్యసిద్ధియు, జయము, కీర్తిని పొందుతారు. సందేహము లేదు.

శ్లో॥ ఉదయాదిత్య సంకాశం ఉదారభుజవిక్రమం
కందర్పకోటి లావణ్యం సర్వవిద్యావిశారదం.

తా. ఉదయభానునివలె శోభించువాడును, (ఉదయించే సూర్యునివలె ప్రకాశించువాడునూ) గొప్ప భుజపరాక్రమం కలవాడునూ, కోటి మన్మథుల సౌందర్యం కలవాడునూ, సర్వవిద్యా విశారదుడును, అగు హనుమంతునికి నమస్కారము.

శ్లో॥ నాదబిందుకళాతీతం ఉత్పత్తి స్థితివర్జితం
సాక్షాదీశ్వర సద్రూపం హనూమన్తం భజామ్యహం.

శ్లో॥ **ధ్యాయేద్బాల దివాకరద్యుతినిభం దేవారిదర్పాపహం**
**దేవేంద్రప్రముఖ ప్రశస్త విభవం దేదీప్యమానంరుచా।**
**సుగ్రీవాది సమస్త వానరయుతం సువ్యక్తతత్త్వప్రియం**
**సంయుక్తాయుతలోచనం పవనజం, పీతాంబరాలంకృతం**

తా. బాలభానుని సూర్యునివలె ప్రకాశించువాడును, దానవుల దర్పమును (గర్వము) పోగొట్టినవాడును, ఇంద్రాది దేవతలచే పొగడబడిన వైభవము కలవాడును, దేదీప్యమానముగా ప్రకాశించువాడును, సుగ్రీవుడు మొదలైన కపివరులతో కలిసి యుండువాడును, చక్కగా వ్యక్తమొనర్చబడిన (వ్యక్తం చేసిన) తత్త్వ ప్రియత్వము కలవాడును, పీతాంబరమును ధరించి నిమీలిత నేత్రుడై గోచరించు మారుతిని ధ్యానించుచున్నాము.

శ్లో॥ **శ్రీమద్భూసుత శోకనాశనకరం శ్రీఆంజనేయం సదా।**
**నానాలంకరణం త్రిపంచనయనం, దేదీప్యమానంరుచా**
**అక్షఘ్నం ఘనశత్రు చాపదమనం శ్రీరుద్రరూపంవిభుం**
**శత్రుఘ్నం తరుణార్క కాన్తివదనం శ్రీరామదూతంభజే।**

తా. భూదేవి కుమార్తె ఐన సీతాదేవి దుఃఖమును పోగొట్టిన వాడును, నానావిధములైన అలంకారములతో శోభించు(ప్రకాశించు) వాడును, పదునైదు నేత్రములు కలవాడును, దేదీప్యమానముగా ప్రకాశించువాడును, అక్షుని వధించినవాడునూ, శత్రు సంహారకుడును, రుద్రరూపంకలవాడునూ, విభుడును, శత్రువులను సంహరించువాడునూ, బాలభానుని వంటి కాంతిమంతమైన మోము (ముఖం) కలవాడును, శ్రీరామదూత అగు హనుమంతుని భజించుచున్నాను

-: శ్రీపరాశరమహర్షి మైత్రేయమహామునితో చెప్పుచున్నాడు :-

శ్లో॥ **అన్యద్రహస్యం వక్ష్యామిశ్రుణుష్వ మునిపుంగవ**
**పురాధనంజయ స్సాక్షాత్ద్వాపరేజయకాంక్షయా.**

తా. మైత్రేయ మహామునీ! మరియొక రహస్యము చెప్పుచున్నాను వినవలసినది: పూర్వము ద్వాపరయుగమున అర్జునుడు దిగ్విజయము నాకాంక్షించినవాడై -

శ్లో॥ **హనూమంతం పతాకాయాం సంస్థాప్య కపినాయకం**
**జగాయసకలాన్ శత్రూన్ సర్వలోకేషు విశ్రుతః**

తా. వానరశ్రేష్ఠుడగు శ్రీహనుమంతుని (అర్జునుడు) తన పతాకము (జెండా)పై ఉంచుకొని సమస్త శత్రువులను జయించి లోకములన్నిట కీర్తింపబడెను. ఆ కారణముననే అర్జునుడు కపిధ్వజుడని విఖ్యాతినందెను.

## శ్రీ హనుమ ద్వాదశ నామములు

శ్లో॥ **హనుమానంజనా సూనుః వాయుపుత్రోమహాబలః**
**రామేష్టః ఫల్గుణ సఖః పింగాక్షోఽ మిత విక్రమః**
**ఉదధి క్రమణశ్చైవ సీతాశోక వినాశకః**
**లక్ష్మణ ప్రాణ దాతాచ దశగ్రీవస్య దర్పహా**
**ద్వాదశైతాని నామాని కపీంద్రస్యమహాత్మనః**
**స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రాకాలే విశేషతః**
**తస్య మృత్యుభయంనాస్తి సర్వత్ర విజయీ భవేత్.**

శ్లో॥ అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపై కుబ్జపై
నరుపై ద్రౌపతిపై కుచేలునిపయిన్ నందవ్రజశ్రేణిపై
పరగన్ గల్గు భవత్కృపారసము నాపై కొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులె నమ్మినాడ జగదీశా కృష్ణా భక్తిప్రియా।

## శ్రీ హనుమత్కృత సీతారామ స్తోత్రం

శ్లో॥ అయోధ్యాపుర నేతారం మిథిలాపుర నాయికాం
రాఘవాణామలంకారం వైదేహానామలంక్రియాం

తా. అయెూధ్యానగరానికి నాయకుడును, మిథిలానగరానికి నాయకురాలును, రఘువంశీయులకు అలంకారమైనటు వంటివాడును, విదేహవంశీయులకు అలంకారమైనటు వంటి శ్రీరామునకు సీతాదేవికి నమస్కారము.

శ్లో॥ రఘూణాం కులదీపంచ నిమీనాం కులదీపికాం
సూర్యవంశ సముద్భూతం సోమవంశ సముద్భవాం

తా. రఘువంశ కులదీపమైనటువంటి వాడును, నిమి వంశీయుల కులమును ప్రకాశింపచేయు దానిని, సూర్యవంశంలో పుట్టిన వానిని, చంద్రవంశంలో పుట్టిన దానిని - శ్రీరామునకు సీతాదేవికి నమస్కారం.

శ్లో॥ పుత్రం దశరథస్యాపి పుత్రీం జనక భూపతేః
వశిష్ఠానుమతాచారం శతానంద మతానుగాం

తా. దశరథ మహారాజు పుత్రుడునూ, జనక మహారాజు పుత్రికనూ వశిష్ఠ మహర్షి యొక్క మతాచారమును అనుసరించే వాడును శతానంద మహర్షి యొక్క ఆచారమును అనుసరించునది అయిన శ్రీరామునకు సీతాదేవికీ నమస్కారములు.

శ్లో॥ **కౌసల్యా గర్భ సంభూతం వేది గర్భోదితాం స్వయం**
**పుండరీక విశాలాక్షం స్ఫురదిందీవరేక్షణాం**

తా. కౌసల్యా దేవి గర్భము నుండి ఉద్భవించినవాడును స్వయముగా యజ్ఞ భూమి నుండి ఉద్భవించినది, తామరపువ్వు వలె విశాలమైన కన్నులు కలవాడును ప్రకాశించే నల్లకలువ వంటి కన్నులు గలది అగు శ్రీరాముని గూర్చి సీతాదేవి గూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ **మత్త మాతంగ గమనం మత్త హంస వధూగతాం**
**చందనార్ద్రభుజామధ్యం కుంకుమార్ద్ర కుచస్థలీం**

తా. మదించిన ఏనుగువలె నడుచువాడు మదించిన ఆడహంస వలె నడచునది, మంచిగంధము చేత తడిసిన వక్షస్థలం కలవాడు, కుంకుమ పూయబడిన వక్ష స్థలం కలది అయిన శ్రీరాముని గూర్చి సీతాదేవిని గూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ **చాపాలంకృత హస్తాబ్జం పద్మాలంకృత పాణికాం**
**శరణాగత గోప్తారం ప్రణిపాత ప్రసాదికాం**

తా. ధనస్సు చేత అలంకరింపబడిన పద్మమువంటి హస్తంకలవాడు తామర పూవుచేత అలంకరింపబడిన చేయికలది, శరణాగతులను రక్షించువాడు, సాష్టాంగ నమస్కారము చేయుటచేత ప్రసన్న మగునది అగు శ్రీరామచంద్రునకు సీతాదేవికి నమస్కారము.

శ్లో॥ **కాలమేఘ నిభం రామం కాకస్వర సమప్రభాం**
**చంద్రకాంత్యాననాంభోజం చంద్రబింబోపమాననాం**

తా. నల్లని మేఘం వంటి శరీరం కలవాడు, బంగారముతో సమానమైన కాంతి కలది, చంద్రునివంటి కాంతితో కూడిన ముఖమనే పద్మము కలవాడు చంద్రబింబముతో పోల్చదగిన ముఖంకలది అగు

శ్రీరామచంద్రుని గూర్చి సీతాదేవి గూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ **సర్వలోక విధాతారం సర్వలోక విధాయినీం**
**లోకాభిరామం శ్రీరామం అభిరామాంచమైథిలీం**

తా. అన్ని లోకములను శాసించువాడును, అన్నిలోకములను శాసించునది, లోకములో సుందరుడైన శ్రీరాముడు, మిక్కిలి అందముగా ఉన్న సీతాదేవినిగూర్చి శ్రీరామచంద్రుని గూర్చి నమస్కారము.

శ్లో॥ **దివ్యసింహాసనాసీనం దివ్యస్రగ్వస్త్ర భూషణాం**
**అనుక్షణ కటాక్షాభ్యాం అన్యోన్యేక్షణ కాంక్షిణౌ**

తా. దివ్యమైన సింహాసనముపై కూర్చున్నవాడు దివ్యమైన పూవులు, వస్త్రములు అలంకారములు ధరించినది, ప్రతీక్షణమూ కడగంటి చూపులచేత పరస్పరము చూచుటకు గోరువారు అయిన శ్రీరామచంద్రుని గూర్చి సీతాదేవిని గూర్చి నమస్కారము.

శ్లో॥ **అన్యోన్య సదృశావేతౌ త్రైలోక్యగృహదంపతీ**
**ఇమౌ యువాం ప్రణమ్యాహం భజామ్యద్యకృతార్థతాం**

తా. ఒకరికొకరు తగిన ఆకారములు కలవారు, మూడులోకముల నెడ గృహములకు దంపతులు అయిన మిమ్ము గూర్చి నమస్కరించి నేనిపుడు కృతార్థతను పొందుచున్నాను.

శ్లో॥ **అనయాస్తౌతియ స్తుత్యా సీతా రామౌ చ భక్తిదః**
**తస్యతౌ తనుతాంప్రీతౌ సంపదస్సకలాఅపి**

తా. ఈ స్తుతిచేత సీతారాములను భక్తితో స్తుతించిన వారికి వారు (సీతారాములు) ప్రీతిపొందిన వారై నకలనంపదలను పెంపొందించెదరు.

శ్లో॥ ఇతీదం రామచంద్రస్య జానక్యాశ్చ విశేషతః
కృతం హనుమతాపుణ్యం స్తోత్రం సద్యోవిముక్తిదం

తా. ఇది రామచంద్రునికి-సీతాదేవికి విశేషముగా హనుమంతుడు చేసిన పుణ్యమైన స్తోత్రం. ఇది వెంటనే ముక్తిని ప్రసాదించునది.

శ్లో॥ యఃపఠేత్ ప్రాతరుత్థాయ సర్వాన్ కామానవాప్నుయాత్
యఇదం పఠతిస్తోత్రం సనరోహత కిల్బిషః

తా. ఈ స్తోత్రమును ఉదయమున చదివినవాడు అన్ని కోరికలను పొందును. ఈ సీతారామస్తోత్రమును పఠించిన వాడు పాపములు పోయిన వాడై శ్రీ వైకుంఠమును పొందును.

**ఇతి హనుమద్విరచిత సీతారామ స్తోత్రం సంపూర్ణమ్**

ఇది హనుమంతుడు రచించిన సీతారామ స్తోత్రం.

## శనివారంనాడు

## భరతుడు హనుమంతుని పూజించుట

శ్లో. సతతం మంద వారేషు భరతః క్షత్రియోత్తమః
హనూమంతం భజన్తస్థౌ నిరంకుశ పరాక్రమః

తా. ప్రతి శనివారమందు రాజశ్రేష్టుడగు భరతుడు హనుమంతుని పూజించి ఎదురులేని పరాక్రమము కలవాడై యుండెను.

– పరాశర సంహిత

## మంగళవారంనాడు

## సీతాదేవి హనుమంతుని పూజించుట

శ్లో. భౌమవారే, హనూమంతం, సీతాఃసంపూజ్య యత్నతః
గతవ్యధా మనోవాంఛా సిద్ధిం శీఘ్రమవాప్తసా.

తా. మంగళవారం ప్రయత్నపూర్వకంగా హనుమంతుని పూజించుట వలననే సీతాదేవి కష్టములనన్నింటినీ పోగొట్టుకొని శీఘ్రంగా మనోవాంఛా సిద్ధిని పొందగల్గెను. - పరాశర సంహిత

## శ్రీ హనుమజ్జయంతి

**శ్లో॥ వైశాఖే మాసి కృష్ణాయాం దశమీ మంద సంయుతా**
**పూర్వప్రోష్ఠ పదాయుక్తా తథావైధృతి సంయుతా**

తా. వైశాఖ మాసంలో కృష్ణ పక్షంలో దశమి శనివారం (నాడు) రోజున పూర్వాభాద్రా నక్షత్రంలో వైధృతియోగంలో శుభసమయంలో మధ్యాహ్న సమయంలో శ్రీఆంజనేయస్వామి జన్మించెను.

**శ్లో పూర్వాభాద్రా కుంభరాశౌ మధ్యాహ్నే కర్కటాంశకే**
**కౌండిన్య వంశ సంజాతో హనుమానంజనోద్భవః**

తా. పూర్వాభాద్ర నక్షత్రం కుంభరాశి యందు మధ్యాహ్నం కర్కాటక లగ్నంలో కేండిన్యస గోత్రంలో హనుమంతుడు ఉద్భవించెను.

## హనుమద్వ్రతం

**శ్లో॥ మార్గశీర్షే త్రయోదశ్యాం శుక్లాయాం జనకాత్మి జా**
**దృష్ట్వా దేవీ జగన్మాతా - మహావీరేణధీమతా**

తా. మార్గశిర శుద్ధ త్రయోదశి రోజున జగన్మాత ఐన సీతాదేవిని మహావీరుడైన హనుమంతుడు చూచెను.

ఆరోజునే హనుమద్వ్రతం. హనుమంతునికి చాలా ఇష్టమైనరోజు.

# ఆంజనేయస్వామి కళ్యాణం

**శ్లో॥ జ్యేష్ఠ శుద్ధ దశమ్యాంచ భగవాన్ భాస్కరోనిజాం**
**సుతాం "సువర్చలా" నామ్నీం ప్రాదాత్ ప్రీత్యా హనుమతే**
**పరాశర సంహితా**

తా. జ్యేష్ఠ శుద్ధ దశమి రోజున సూర్యనారాయణమూర్తి తన కుమార్తె ఐన "సువర్చలా దేవిని" హనుమంతునికిచ్చి వివాహము చేసెను.

**శ్లో॥ గత్వాతు విజయస్తత్ర కింబుద్ధి రభవన్మునే**
**పరాశర మహాప్రాజ్ఞ తద్వృత్తం వక్తుమర్హసిః**

తా. మైత్రేయుడు ఈ రీతిగా అడిగెను: సర్వజ్ఞుడగు ఓ పరాశర మహామునీ! విజయుడు తననగరమునకు వెళ్లినవాడై ఎట్టి ఆలోచనతో ఉండెనో ఆ వృత్తాంతమును కూడా చెప్పవలసినది.

**శ్లో॥ విజయోగృహమాసాద్య, ప్రజాధర్మేణ రంజయన్**
**భుంజాన(బంధుభిః) స్సకలాన్భోగాన్ బహుకాలం నినాయసః**

తా. శ్రీ పరాశరుల వారు ఈ ప్రకారమున చెప్పిరి. మైత్రేయా! విజయుడు ఇంటికి వచ్చి ప్రజలను ధర్మముగా పరిపాలించుచూ సంతోషపెట్టుచూ సమస్త సుఖములను బంధువులతో అనుభవించుచూ చాలాకాలము గడిపెను.

**శ్లో॥ రాజాహనుమదాదేశాజ్జిఘృక్షుర పరాంతనుం**
**సుఖితామపి పూర్వాంతు, మేనే భారమివాత్మనః**

తా. రాజైన అతడు హనుమంతుని ఆజ్ఞవలన వేరొక దేహమును (గ్రహింపదలచిన వాడై) భరింపదలచినవాడై, పూర్వదేహము సుఖవంతము ఐనను - దానిని బరువుగానే (భారముగానే) తలచెను

శ్లో॥ **తతో హిత్వాతనుం పూర్వాం, విజయోజయకాంక్షయా**
**పాండు పత్న్యాం పృథాయాంతు లేభేదేవేంద్ర పుత్రతాం**

తా. పిమ్మట విజయుడు జయకాంక్ష కలవాడై వెనుకటి దేహమును విడచి పాండురాజు భార్యయగు కుంతీదేవి యందు దేవేంద్రుని అంశతో పుత్రునిగా యేర్పడెను. (పుట్టెను)

శ్లో॥ **యస్యాగ్రజో మహారాజ స్సత్య సంధోయుధిష్ఠిరః**
**తదగ్రజో భీమసేనః భీమకర్మా మహాబలః**

తా. అతని పెద్దన్న మహారాజు సత్యమునే పలుకువాడు అగు ధర్మరాజు ఆ తరువాత అన్న భయంకర కృత్యములు చేయజాలిన మహాబలుడగు భీమసేనుడు

శ్లో॥ **తస్యానుజస్తు విజయో వవృధేమాతృ సన్నిధౌ!**
**స ఏవార్జున నామ్నాసౌ జగృహే సకలాః కలాః**

తా. ఆ భీమసేనుని తరువాత పుట్టిన వాడగు విజయుడు (అర్జునుడు) తల్లి వద్దనే పెరిగెను. అతడే అర్జునుడను పేరుతో అన్ని కళలయందు ఆరితేరెను.

శ్లో॥ **కదాచిద్విజయో రాజా జగదేక ధనుర్ధరః**
**ప్రాచీందిశమగా త్పూర్వంజిగేషు స్సపరిచ్ఛదః**

తా. ఒకప్పుడు ఆ విజయుడు లోకమందు ఏకైక ధనుర్ధరుడగు అతడు జయించుకోర్కెతో పరిజనముతో కూడినవాడై తూర్పు దిక్కునకు వెళ్ళెను.

శ్లో॥ **ప్రాచీనాన్శత్రుసామంతాన్ జిత్వా భుజబలేనసః**
**అనుయాతస్తుతైర్భూపై ప్రపేదే దక్షిణాందిశం**

తా. తూర్పుదిక్కున ఉన్న శత్రు సామంతరాజులను అతడు తన భుజ బలముచే జయించి ఆ రాజులు వెంట రాగా దక్షిణ దిక్కునకు వెళ్ళెను.

**శ్లో॥ దాక్షిణాత్యా న్నిపూన్ రాజా ప్రోత్సార్యచ గుణ స్వనైః**
**సేతుందదర్శ విజయః సూత సంస్తుత విక్రమః**

తా. తన వింటత్రాటి మోతల(ధ్వనుల) చేతనే దక్షిణ దిక్కున ఉన్న శత్రురాజులను పారద్రోలినవాడై సూతునిచేత కొనియాడబడిన పరాక్రమము కల విజయుడు శ్రీరామసేతువును చూచెను.

**శ్లో॥ కిమేతదితి పప్రచ్ఛ మంత్రీన్ వృద్ధాన్ పురావిదః**
**తైరూచే విజయోరాజా సేతుదర్శనవిస్మితః**

తా. సేతువును చూచి రాజైన విజయుడు ఆశ్చర్యపడినవాడై తనతో ఉన్నటువంటి మంత్రులను, వృద్ధులను, పూర్వగాధలు తెలిసినవారు అగు పెద్దలను ఇదేమిటని అడిగెను. వారు ఈ ప్రకారముగా చెప్పినారు.

**శ్లో॥ రాజన్ రఘుపతీరామో రావణస్యదురాత్మనః**
**వధాయ బంధయామాస సముద్రం పర్వతోత్తమైః**

తా. రాజా! రఘుకుల శ్రేష్టుడగు రాముడు దుర్మార్గుడైన రావణుని వధించుటకొరకు పెద్ద పర్వతములతో సముద్రమందు సేతువు కట్టెను (నిర్మించెను)

**శ్లో॥ శతయోజన పర్యన్తా సేయం సేతురివాంబుధౌ**
**ఇతిమంత్రివచ శ్రుత్వా జహాస విజయోనృపః**

తా. నూరుయోజనముల వరకు సముద్రము మీద ఈ సేతువు ఉన్నది. అని మంత్రి చెప్పిన వాక్యమును విని రాజగు విజయుడు

(అర్జునుడు) నవ్వెను. (అర్జునుడు నవ్వుతూ ఈ ప్రకారంగా పలికెను)

శ్లో॥ **స్వయంధానుష్కతాం ప్రాప్య శరాణామపి సంపదం**
**కిమర్థ మన్య ఘూద్రామః ప్రయాసం రఘునందనః**

తా. స్వయముగా గొప్పధనుర్ధరత్వమును గొప్ప శరసంపదను పొందిన రఘునందనుడైన రాముడు ఎందులకు ప్రయాసననుభవించెను.

శ్లో॥ **శరపంజర బంధేన సుతరోయం తు సాగరః**
**ప్రయోజనం నజానేస్య ప్రయాసస్య మహాత్మనః**

తా. శరములతో (బాణములతో) సేతువు కట్టుటుచేత ఈ సాగరము సులభంగా దాటదగినది. ఆ మహాత్ముని యొక్క ప్రయాసకు (పర్వతములతో సేతువు నిర్మించటకు) ప్రయోజనము అర్థమగుట లేదు-

శ్లో॥ **అథాస్మిన్నంతరే శ్రీమాన్ హనుమాన్ మారుతాత్మజః**
**విజ్ఞానా ద్రామ వృత్తాంతమా జగామకృతాంజలిః**

తా. పిమ్మట (ఇంతలో వాయు పుత్రుడు శ్రీమంతుడునగు హనుమంతుడు రామ వృత్తాంతము తెలిసియుండుటవలన అంజలి ఘటించినవాడై అక్కడకు వచ్చెను.

శ్లో॥ **అబ్రవీన్మారుతి ర్భూపం గర్వాంధ తమసావృతమ్**
**యదుక్తమధునా రాజన్ భవతాహేళయానృతమ్**

తా. గర్వమనే అంధతమస్సుతో కూడిన గర్వాంధుడైన రాజును (అర్జునుని) చూచి ఆంజనేయుడు ఈ ప్రకారంగా పలికెను. ఓ రాజా నీవిపుడు పలికిన మాట శ్రీరాముని అవమానించునది. నీచే పరిహాసముగా ఇపుడు పలుకబడినది అసత్యము.

శ్లో॥ **అపాత రమణీయత్వాత్ తన్నక్తో దక్షమంవచః**
**ఋక్షవానర ముఖ్యాస్తు మహా పర్వత సన్నిభాః**
**శరపంజర మార్గేణ తరేయుర్జలధింకథమ్?**

తా. నీవు చెప్పేమాటలు రమణీయముగ ఉన్నను విమర్శనా శుద్ధములుగావు. గొప్ప పర్వతములతో సమానమైన ఏలుగబంట్లు, వానరములు,(కోతులు) మున్నగున్నవి బాణముతో నిర్మించబడిన మార్గమున (వంతెనపై) సముద్రమును ఎట్లు దాటగలరు.

శ్లో॥ **శకుంతపాత మాత్రేణ భిద్యతే శరపంజరః**
**ఏతాదృశంతు పంధానం శ్రద్ధధాతుకథంజనః**

తా. పక్షివాలినంత మాత్రముననే బాణములతో కట్టిన వంతెన విరిగిపోవును (కూలిపోవును) ఇటువంటి మార్గమును జనులు ఎట్లు విశ్వసించుదురు! (నమ్ముదురు)

శ్లో॥ **పిపాసోరధికంజంతోః పిధాయమధురోదకం**
**మరీచికాతోయమివ భవేత్పంజర పద్ధతిః**

తా. అధికముగా దాహం కలవానికి తీయని ఉదకం (నీరు) కావలెను. కాని ఎండమావులలో నీరు ఎంటువంటిదో దాహంతీర్చదో దానివలె ఆ బాణములతో కట్టిన వంతెన (సేతువు) వలన ఏమియు ప్రయోజనం ఉండదు.

శ్లో॥ **అధవా జానకీనాధో మమస్వామీ రఘూద్వహః**
**అవిమృశ్య కథంకుర్యాత్ వృథాలాపై రలంతవ।**

తా. అట్లు కానిచో, స్వామి ఐన జానకీనాధుడు రామచంద్రుడు విమర్శించకుండా (విచారణ చేయకుండా) పర్వతములతో సేతువునెట్లు నిర్మించును. నీ వ్యర్థ ప్రలాపములు కట్టిపెట్టుము

శ్లో॥ **అర్హత్యేషమమారోహం యదివాశర పంజరః**
**గజవాజిరథోపేతాం తథా సేనాంతరిష్యతి (వహిష్యతి)**

తా. ఈ బాణముల వంతెన నేను ఎక్కుటకు తగి ఉన్నచో (నన్ను భరించకలిగినచో) ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో కూడుకున్న సేన దాటగలదు. (సేనను వహించగలదు)

శ్లో॥ **ఇత్యుక్తః కపినాథేన నృపోవచనమబ్రవీత్**
**బధ్యతే జలధిర్ధీర! మయాసాయక పంజరైః**
**శిథిలీకురుతాంతత్తు ప్రసభం శరపంజరః**

తా. అని ఆంజనేయుడు పలుకగా అర్జునుడు ఈవచనమును పలికెను. ఓ ధీరుడా! నేను బాణములతో సముద్రమునకు సేతువును కట్టుచున్నాను. నీవు దానిని ప్రయత్నించి పడగొట్టుము.

శ్లో॥ **ప్లుత(దృఢ)గత్యా యధాశక్తి ధావనేన జవేనవా**
**యేనకేనాపియోగేన శిథిలీకురుపంజరమ్**

తా. గంతులు వేయుట చేతగాని, బలముగా నడచుట చేతగాని, వేగముగా పరుగెట్టుట చేతగాని ఏదో ఒక ఉపాయము చేత ఈ బాణముల వంతెనను ఊడ(విరగ)గొట్టుము.

## అర్జునుని ప్రతిజ్ఞ

శ్లో॥ **సమయః క్రియతే సౌమ్య! (సౌఖ్యం) మయానిశ్చల బుద్ధినా**
**భిద్యతే శర బంధోయం, భవతాయది మారుతే!**
**తదాసద్యః ప్రవేశ్యామి సగాండీవోహుతాశనం**

తా. సౌమ్యుడా! ఆంజనేయా! నేను కట్టిన బాణముల వంతెనను నీవు ఊడగొట్టిన ఎడల నేను గాండీవముతో సహితముగా వెంటనే సుఖముగా అగ్నిలో ప్రవేశించగలనని నేను నిశ్చలబుద్ధితో

సుఖముగా ప్రతిజ్ఞ చేయుచున్నాను.

శ్లో॥ **ఇత్యుక్త్వా శరజాలేన బబంధ జలధింనృపః**

తా. అర్జునుడు ఇటుల పలికి బాణములతో సముద్రమునకు వంతెన కట్టెను.

శ్లో॥ **కపీంద్రోపి తదాదృష్ట్వా శరబంధం తథావిధం**
**రాజానమబ్రవీద్వాక్యం సీతారామ మనుస్మరన్**

తా. ఆంజనేయస్వామి కూడా అప్పుడు అటువంటి బాణముల వంతెనను చూచి సీతారాములను స్మరించుచు(తలచుచు) అర్జునునితో ఈ ప్రకారంగా పలికెను.

శ్లో॥ **సీతారామ పద ద్వంద్వ ధ్యాన సంభృతవిక్రమః**
**భంజేయం శరబంధంతే పదేనైకేన భూమిప**

తా. ఓ రాజా! సీతారాముల పదముల(జంట)ను ధ్యానించుటచే (సేవించుటచే) పరాక్రమముకలవాడనై నేను ఒక్క అడుగుచేతనే నీ బాణముల వంతెనను విరగగొట్టుదును.

శ్లో॥ **న చేత్తవ పతాకాంకో భవేయం విజయోన్ముఖః।**

తా. అట్లు కానిచో నీ విజయమునకు ఉన్ముఖుడనై నీ పతాకమునకు (జెండాకు) చిహ్నముగా ఉండగలను.

శ్లో॥ **ఇత్యుక్త్వా హనుమాన్భూపం ప్రహసన్ముఖ పంకజః**
**ద్విత్రైస్తు పద విన్యాసైర్బభంజ శరపంజరం**

తా. అని ఆంజనేయుడు నవ్వుచున్న ముఖముతో అర్జునునితో ఇట్లు చెప్పి రెండు మూడు అడుగులు వేయుట చేత బాణముల వంతెనను విరుగ గొట్టెను.

శ్లో॥ **దృష్ట్వా పంజర భంగంతు నిర్విణ్ణ వదనోనృపః**
**గాండీవం పాతయామాస కిమేతదితి విస్మితః**

తా. బాణముల వంతెన విరుగట చూచి అర్జునుడు (దిగ్భ్రాంతి) కల్గినవాడై (నిర్ఘాంతపోయినవాడై) దుఃఖాన్ని పొందినవాడై ఇదేమిటని ఆశ్చర్యపోయినవాడై గాండీవమును క్రింద పారవైచెను (పడవేసెను).

శ్లో॥ **నినంద బహుధాత్మానం గాండీవంచ పునఃపునః**
**అధచింతాం సమాపేదే విజయోజయ నిస్పృహః**

తా. తరువాత అతడు తనను తనగాండీవమును మరల మరల అనేక విధములుగా నిందించుకొనుచు, తనకు జయముకలగదను నిస్పృహపొందిన వాడై ఇట్లు చింతించెను.

శ్లో॥ **అద్య ప్రభృతి మచ్ఛక్తేరవ సాదో ధవానను**
**రక్షోమాయాధవానూనం స్వప్నో య మధవా పునః**

తా. నేటి నుండి నా శక్తి నశించినదా! లేక ఇది రాక్షసమాయయా! లేకున్న ఇది కలయై ఉండునా!

శ్లో॥ **యదివామమదిఙ్మోహః బుద్ధిభ్రంశో పివాపునః**
**అన్యథా కథమేతత్తు విపరీతం మహద్భవేత్**

తా. లేక నాకు దిగ్భ్రమ కలిగినదా? లేదా, నాకు బుద్ధి భ్రంశము కల్గినదా? (మతిచలించినదా?) అట్లుకానిచో ఇంత గొప్ప విపరీతము ఎట్లు జరిగెను.

శ్లో॥ **ఇతి సంచిత్య మనసా సహసా నృపనాయకః**
**ప్రజ్వాల్య పావకం తత్ర ప్రవేష్టుముప చక్రమే**

తా. ఇలా అనేక విధములుగా ఆలోచించి తొందరగా ఆ రాజు (అర్జునుడు) అగ్నిని ప్రజ్వలింపచేసి దానిలో ప్రవేసించబోయెను (ప్రవేసించుటకు సిద్ధమాయెను)

**శ్లో॥ అథాస్మిన్నంతరే కృష్ణః పాండవానుజిఘృక్షయా**
**తం దేశమగమత్తూర్ణం నిరస్తాన్య ప్రయోజనః**
**ఆగత్య వాసుదేవస్తు పప్రచ్ఛ హనుమన్నృపౌ**

తా. పిమ్మట ఇంతలో కృష్ణుడు ఇతర ప్రయోజనమును వదులుకొని (ఇతరములగు పనులన్నియు మాని) పాండుకుమారుడైన అర్జునుని అనుగ్రహించుటకు ఆ ప్రదేశమునకు శీఘ్రముగా వచ్చి హనుమంతుని, అర్జునుని ఇట్లు అడిగెను.

**శ్లో॥ యువాభ్యాం కింకృతం ధీరౌ వదతాంమేనియుంజతః**
**కిమర్థం జ్వలితో వహ్నిః భగ్నోవాశర పంజరః**

తా. ఓ ధీరులారా! మీరిద్దరూ ఏమి చేసిరి! నేను అడుచున్నాను చెప్పవలసినది. అగ్ని ఎందుకు ప్రజ్వలింపచేయబడినది. ఈ బాణముల వంతెన ఎందుకు విరిగినది. అప్పుడు వారు కృష్ణ పరమాత్మకు జరిగిన దానిని చెప్పిరి.

**శ్లో॥ తావబ్రూతాం యథావృత్తం కృష్ణస్య పరమాత్మనః**
**శ్రుత్వానిగదితం తాభ్యాం ప్రాహతౌ గరుడధ్వజః**

తా. వారు చెప్పనది విని గరుడధ్వజుడైన శ్రీ కృష్ణుడు ఇట్లు పలికెను.

**శ్లో॥ అసాక్షిక మిదం కర్మకృత వంతౌ కథంయువాం?**
**శర పంజర సంస్థానం, కీదృశం భవతా కృతమ్**

తా. సాక్షిలేని పనిని మీ రెట్లు చేసిరి? అర్జునా! నీవు బాణముల వంతెనను ఎట్లు కట్టితివి

శ్లో॥ త్వయా వాశరబంధస్య విశ్లేషః కథమాహతః
పశ్యేయం యువయోఃకర్మ పునరేవ విధీయతాం

తా. ఆంజనేయా! నీవు ఆ వంతెనను ఎట్లు ఊడగొట్టితివి. మీ ఇద్దరి పనులను మరల చేయండి నేను చూచెదను.

శ్లో॥ శ్రుత్వా కృష్ణ వచస్తత్ర పాండవో హృదయ ప్రియం
బంబంధ జలధిం తూర్ణం పునరేవ శరైశ్శరైః

తా. అర్జునుడు తన మనస్సునకు ప్రియమైన కృష్ణుని వాక్యమును విని మరల పలుబాణములతో సముద్రముపై వంతెనను కట్టెను.

శ్లో॥ తతోహరిస్తు సర్వాత్మా సర్వభూతదయాపరః
అధస్తాచ్ఛరబంధస్య ప్రవిష్టః కమఠాకృతిః

తా. అందరికి ఆత్మయును, సర్వభూతముల యందు దయకల హరి (కృష్ణుడు) తరువాత (అర్జునుని) బాణముల వంతెన క్రింద తాబేలు అకారము ధరించియుండెను

శ్లో॥ హనుమన్నపిసంనద్ధః శరపంజర భేదనే
ఆరురోహ శరారోహం పంజరీకృత విగ్రహః

తా. హనుమంతుడు దుర్భేద్యమైన - దృఢమైన శరీరం కలవాడై బాణముల వంతెనను ఛేదించుట కొఱకు సిద్ధమైన వాడై (ఊపిరి బిగపెట్టినవాడై) సన్నద్ధమగు దేహముతో దానిని ఎక్కెను!

శ్లో॥ అవష్టభ్య పద ద్వంద్వం యథాశక్తి సమారుతిః
అధోనినీషయాతూర్ణం చాలయామాస పంజరః

తా. ఆ మారుతి తన యొక్క బలమునంతయూ ఉపయోగించి ఆ వంతెనపై గట్టిగా తన పాదములను (ఊనెను) నొక్కెను. దానిని శీఘ్రముగా క్రిందపడ వేయుటకు కదలించెను.

శ్లో॥ తథాపి దృఢ సంస్థానాన్నచచాలేషు సంహతిః
ధావతోస్మా దత శీఘ్రం మారుతి శ్మర వర్త్మనే

శ్లో॥ తథాపిచనకంపేసౌ కూర్మా వష్టంభ వైభవాత్
ఉడ్డీయోడ్డీయవేగేన న్యపత త్ప్లుతవిక్రమైః

తా. అట్లైనను దృఢమైన కూర్పువలన ఆ బాణముల వంతెన కదల లేదు. ఆ బాణముల వంతెన మీద అతడు వేగముగా ఇటునుండి అటునుండి పరుగెట్టినను కూర్మ రూపుడైన హరి పైన ఆ వంతెన ఆని ఉండిన ప్రభావము చేత కంపించలేదు. అతడు మరల మరల (హనమంతుడు) ఎగిరి ఎగిరి వేగముగా గంతులు వేయుచూ దానిపై(వంతెనపై) దూకెను.

తా. అర్జునుడు కట్టిన బాణముల వంతెన క్రింద శ్రీకృష్ణుడు కూర్మ (తాబేలు) రూపంలో వంతెనను కాపాడటం వలన. అంజనేయుడు ఎంత ప్రయత్నం చేసిననూ వంతెన విరగలేదు.

విశ్లేషణ: పూర్వం - దేవతలు దానవులు - పాల సముద్రమును మథించుటకై మంథర పర్వతమును కవ్వముగా చేసి వాసుకి అను సర్పమును తాడుగా చేసి సాగరమును చిలికెను. అపుడు శ్రీమహావిష్ణువు కూర్మ అవతారమును ఎత్తెను. ఇప్పుడు మరల రెండవసారి అర్జునుని రక్షించుటకై ఆంజనేయుడు, అర్జునుని జెండాపై ఉండుటకై హరి రెండవసారి కూర్మ (తాబేలు) అవతారమును ధరించి అర్జునుని రక్షించెను.

శ్లో॥ తథాపిశర సంఘాతః నకించిదపి వైకృతం
దుష్కర ప్రతిఘాసస్య స్వవీర్యస్యజగత్త్రయే
అపూర్వ ప్రతిఘాతేన బహ్వామన్యత సోర్జునం

తా. అయినను ఆ బాణముల వంతెన కొంచెము కూడ మార్పు పొందలేదు. మూడులోకముల యందు తన పరాక్రమమునకు ప్రతిఘటనము (ఎదిరించుట) లేని ఆంజనేయుడు అపూర్వమైన ఎదురు దెబ్బచేత అర్జునుని మిక్కిలి గొప్పవానిగా తలచెను.

శ్లో॥ **హనుమత్పద విష్ణంభజర్ఘురీకృత చర్మణః**
**కమఠేశ్వర పృష్ఠాగ్రాత్సుస్రావాసృఙ్నదీతతః**

తా. తరువాత హనుమంతుని పాదములుగట్టిగా ఆనుటచేత కూర్మావతారము యొక్క చర్మము నరుకబడి దానివీపునుండి రక్తము నదివలె ప్రవహించెను.

శ్లో॥ **అథాంజనీసుత శ్రీమాన్ నిజ విక్రమవక్రతాం**
**అసృఙ్మయం జలంవాపి నిరీక్ష్యావరురోహసః**

తా. తరువాత శ్రీమంతుడైన అంజనీ కుమారుడు తన పరాక్రమము విఫలమగుటను, రక్తముతో నిండిన సముద్ర జలమును చూచి బాణముల వంతెననుండి క్రిందకు దిగెను.

శ్లో॥ **కపీంద్రోభక్తవాత్సల్యా ద్వర దానాత్స్వయంపురా**
**లక్ష్మీశ పక్షపాతాచ్ఛ నివృత్త శ్శరభంజనాత్**

తా. భక్తునియందలి వాత్సల్యము వలన, తాను పూర్వము వరమిచ్చుట వలన శ్రీ కృష్ణుని పక్షపాతము వలన కపీంద్రుడు ఆ బాణపు వంతెనను (బాణముల వంతెనను) కూల్చు ప్రయత్నమును విరమించెను.

శ్లో॥ **స్వభక్త విజయం వీక్ష్య సంప్రహృష్ట మనాభృశం**
**పరాజితో హమస్మీతి బభాషే వాయునందనః**

తా. ఆంజనేయుడు తన భక్తుని విజయమును చూచి గొప్పదైన ఆనందమును పొందినవాడై నేను పరాజితుడనైతిని(ఓడితిని) అని పలికెను.

శ్లో॥ **రాజన్ త్వమపి మద్భక్తో విజయః పూర్వజన్మని**
**మన్మంత్రజపనిష్ఠాతో నిత్య కర్మ సుదీక్షతః**

తా. ఓ రాజా! నీవు కూడా పూర్వజన్మలో నా భక్తుడవైన విజయుడవు. నా మంత్రజపమందు నిష్ఠాతుడవు నిత్యకర్మల ఆచరణమందు కలవాడవు

శ్లో॥ **దిగ్జిగీషుర్భవాన్సద్యస్సత్వరం సర్వ విగ్రహః**
**సత్వంమయానునీతస్సన్ భావికార్య వశాద్భృశం**
**నివృత్తో విజిగీషాత్తు తదానీం నృపనందనః**

తా. నీవు దిక్కులను జయించదలచి అందరితోనూ యుద్ధము కలవాడవై (యుద్ధము చేయువాడవై) నేను భవిష్యత్తులోని కార్యముల వశము వలన నిన్ను అనునయించగా నీవు అపుడు జయించు కోరికను వదిలితివి.

శ్లో॥ **ఇదానీం సమయోరాజన్ విజేతుం సకలాదిశః**
**అద్య ప్రభృతి శత్రుభ్యోనస్యాత్తవ పరాభవః**

తా. రాజా! అన్ని దిక్కులను జయించుటకు ఇపుడు సమయము. ఇప్పటి నుండి (ఈరోజు నుండి) నీకు శత్రువుల వలన పరాభవము కలుగదు.

శ్లో॥ **దుర్భరోయంమహాభారో మద్భక్తస్య పరాభవః**
**ససరిత్సింధు శైలాభూర్నమేభారాయ కల్పతే**

తా. నదులతోను - నదములతోను కొండలతోను, కూడిన భూమి నాకు భారము కాదు నాభక్తునకు పరాభవము కలుగుట నాకు గొప్ప భారము అది భరించరానిది.

శ్లో॥ **వరదాన ప్రతిజ్ఞాతు విజయార్జున జన్మని**
**పరాజయ భవేనాద్య ప్రాప్నోమి ధ్వజ చిహ్నతామ్**

తా. ఓ అర్జునా! పూర్వజన్మలో వరమిచ్చెదనని ప్రతిజ్ఞ చేసితిని. ఇపుడు అపజయమనే వంక చేత నీ జెండాపై చిహ్నముగా అయ్యెదను.

శ్లో॥ **ఇత్యుక్త్వావచనం శ్రీమాన్ హనుమాన్ భక్త వత్సలః**
**విజయస్య స్వభక్తస్య ఖ్యాతయే జగతాంత్రయే**
**ప్రతిజ్ఞా రక్షనార్థంచ లేభేతస్య ధ్వజాఙ్కతామ్**

తా. అని పలికి శ్రీమంతుడు, భక్తవత్సలుడైన ఆ హనుమంతుడు తన భక్తుడైన విజయునకు మూడులోకములందు ఖ్యాతి కొఱకు తన ప్రతిజ్ఞను రక్షించుకొనుటకు అతని జెండాపై చిహ్నముగా అయ్యెను.

శ్లో॥ **తదా ప్రభృతిలోకేషు పాండవస్సఫలోద్యమః**
**కపిధ్వజ ఇతి ఖ్యాతిం జగామ జగతాం వరః।**

తా. లోకములలో గొప్పవాడైన అర్జునుడు సఫలమైన ప్రయత్నము కలవాడై అప్పటినుండి లోకములందు కపిధ్వజుడను ఖ్యాతి (ప్రసిద్ధి)ని పొంది (జెండాపై కపిరాజు) అని సంచరించసాగెను.

శ్లో॥ **తతః కపిధ్వజోరాజాస్మయ మానముఖాంబుజః**
**కృష్ణం నిరీక్ష్య పశ్యంతం వచనం చేదమ బ్రవేత్**

తా. తరువాత కపిధ్వజడైన అర్జునుడు నవ్వుతో కూడిన ముఖముతో తనను చూచుచున్న కృష్ణుని చూచి ఈ వచనమును పలికెను.

శ్లో॥ **కృష్ణ పశ్యమమ ప్రజ్ఞా భుజ వీర్యమనర్గళా**
**నమేస్తి త్రిషులోకేషు ప్రతియోద్ధా కథంచన**

తా. ఓ కృష్ణా! నా ప్రజ్ఞను అడ్డులేని నా భుజ వీర్యమును చూడుము నాకు మూడులోకములందు ఏవిధముగాను ఎదురు నిలుచు వీరుడు లేడు.

శ్లో॥ **అజేయో సురజేతాపి హనుమాన్ శివనందనః**
**భుజ వీర్య జితో యస్మాధ్వజలక్షణ తామగాత్**

తా. దేవతలను కూడా జయించినవాడు శివకుమారుడు ఎవరి చేతను జయింపబడనివాడు అయిన హనుమంతుడు నా భుజ వీర్యముచే (భుజబలముచే) వోడుటచేత నా (టెక్కెము) జెండాపై గుర్తుగా అయ్యేను.

శ్లో॥ **ఇతి గర్విత చేతస్కం పాండవం యదునందనః**
**ఉవాచవచనం శ్రీమాన్ తస్య గర్వోపశాంతయే**

తా. ఇట్లు గర్వించిన మనస్సు కల్గిన అర్జునుని చూచి అతని గర్వము తొలగించుట కొఱకు బుద్ధిశాలి - శ్రీమంతుడైన యదునందనుడు (శ్రీకృష్ణుడు) ఇట్లు పలికెను.

శ్లో॥ **యదాతే విజిగీషాస్యా త్ప్రతిజ్ఞా పూర్వికార్జునః**
**తదాశ్రమాతిరేకోమే దీయతే సుహృదాత్వయా**

తా. అర్జునా ఎప్పుడైతే నీకు ప్రతిజ్ఞతో కూడిన విజయేచ్ఛ యేర్పడుచున్నదో అప్పుడునాకు స్నేహితుడవగు నీ చేత మిక్కిలి శ్రమ ఈయబడుచున్నది. (నీ విజయమును గురించి నేను బాధపడవలసి వచ్చినది.)

శ్లో॥ **ప్రణమామోవయం పార్థ సదాస్వాభీష్టదేవతామ్**
**ప్రబలద్వేషిణం జిష్ణో సంయద్వామా భవత్వితి**

తా. అర్జునా! మనము జయశీలుడవగు నీకు బలవంతునితో శత్రుత్వమును కూర్చుకుండుటకై మన ఇష్టదేవతకు నమస్కరింతుము

శ్లో॥ **నృపతే సమయోత్సేక స్తావకోమామకంవపుః**
**హనుమత్పద విష్టంభబాధితం బాధతే పునః**

తా. ఓ అర్జునా! జయశీలుడవైన రాజా మిక్కిలి ద్వేషించువాని విషయమున - ప్రతికూలమైన వచనమున నియమించుకొనమని నా సూచన - నీ శపధ గర్వము - హనుమంతుని పాదము అనుటచేత నా బాధింపబడిన నా శరీరము మరల బాధించుచున్నది.

శ్లో॥ **పశ్యరాజన్మదీయాంగం శోణితాక్త త్వగంతరం**
**శిధిలీకృత శల్యాగ్రం నిష్ర్యూత బహుమేదసం**

తా. రాజా! రక్తము చిమ్మిన చర్మలోపలి భాగముకలది. (పిదిలి) శిధిలమైన ఎముకకొన భాగముకలది ఎక్కువ మేదస్సును పైకినెట్టబడినది ఐన నా శరీరమును చూడుము.

శ్లో॥ **తత్ప్రతిజ్ఞాం సమాలోక్య కూర్మనాయక విగ్రహః**
**అధస్తాత్పంజర స్యాహ మవష్టభ్యావతస్థివాన్**

తా. నీ ప్రతిజ్ఞను చూచి పెద్ద తాబేలు (కూర్మరాజు) రూపముకలవాడనై బాణముల వంతెన క్రింద ఆధారముగా (మోస్తూ) ఉన్నాను.

శ్లో॥ **తదాపాద ప్రహారేణ వాయుసూనోర్మహాత్మనః**
**ఝుర్జరీకృత సర్వాంగో బహు సంకట మభ్యగామ్**

తా. అపుడు మహాత్ముడైన వాయుకుమారుని పాదం తాకిడి చేత శరీరమంతా శిధిలమై మిక్కిలి సంకటమును పొందితిని.

శ్లో॥ కోవాయుధి కపీంద్రస్యత్రాతాతి కుపితాత్మనః
యత్రవజ్రాది శస్త్రాణి తూల ప్రాయాణి జగ్మిరే

తా. ఈ కపీంద్రునికి వజ్రాయుధము మొదలైన ఆయుధములు దూదిపింజలవలె ఐనవి. కోపగించిన ఈయన యుద్ధము చేయునపుడు రక్షించువాడెవడు.

(ఎవని ఎదుట వజ్రాయుధము మొదలైన ఆయుధములు దూదిపింజతో సమానమో అట్టి హనుమంతుని ఎదుట అందునా మిక్కిలి కోపముగా ఉన్న వాని ఎదుట యుద్ధమున నిలుచుటకు సమర్థుడెవడు?)

శ్లో॥ కింతు మచ్ఛ్రమ వేదిత్వాద్వరదానాత్తు తేపురా
భావికార్య ప్రభావాచ్చ ధ్వజాగ్రే సముపస్థితః

తా. కాని ఇతడు నాశ్రమను ఎరుగుటవలన, నీకు లోగడ వరము ఇచ్చుట వలన, జరుగబోయే కార్యము యొక్క ప్రభావము వలన, నీ జెండాపైన ఉన్నాడు (ఉండుటకు అంగీకరించినాడు కాని ఓడిపోయి కాదు.)

శ్లో॥ ఇత్యుక్త్వా తస్యతోషాయ ప్రశశంస హరిః పునః
కృతాఽర్థోస్మి మహాభాగ హనూమద్భక్తి తోషితః
ఆస్తే ధ్వజపతాకాయాం, జయ మిచ్ఛన్ సదాతవ

తా. ఇట్లుపలికి శ్రీకృష్ణుడు అతనిని (అర్జునుని) సంతోషింపచేయుటకు మరల ఇట్లు ప్రశంసిచెను.

మహాభాగ! అతడు నీకు జయమును కోరుచూ ఎల్లప్పుడూ నీ జెండాపై ఉండుటచే (ఉండుటకు అంగీకరించుటచేత) ఈ హనుమంతుని భక్తిచేత సంతోషించినవాడనై నేను కృతార్థుడనైతిని.

శ్లో॥ **ఇతి స్వాంతవచస్సారై స్తదవ జ్ఞాం మమర్పసః**
**తతోహృష్టమనాః పార్థః కపీంద్ర ధ్వజలాభతః**
**అవశిష్ట దిశస్సర్వాః జిగాయ భుజవిక్రమైః**

తా. ఇట్లు అనునయించే మాటల చేత అర్జునుని (అవభావమును) అజ్ఞానమును శ్రీకృష్ణుడు తుడిచివేసెను. తరువాత హనుమంతుడు కపీంద్రధ్వజములభించుటచేత సంతోషించిన అర్జునుడు తన భుజ పరాక్రమములతో మిగిలిన దిక్కులను జయించెను.

శ్లో॥ **ఇతి పవనసుత ప్రసాద లాభాత్**
**సకల హరిర్జయ సంప్రహృష్ణ చేతాః**
**అలభత నిజమందిరం, సజిష్ణుః**
**పథియదునాయక దత్త సూతభావః**

తా. ఇట్లు ఆంజనేయుని ప్రసాదము లభించుట వలన అన్ని దిక్కులను జయించుట చేత సంతోషించిన మనస్సు కలవాడై అర్జునుడు శ్రీకృష్ణుడు సారధ్యము వహించగా తనమందిరమును చేరెను.

శ్లో॥ **అధసుర పతిసూనురిత్థ తేజాః**
**సకలదిగీశ కిరీట జుష్టపీఠః**
**చిర మరమత కృష్ణయా సకృష్ణః**
**కురుపతిగౌరవ భంగ హేతువాలః**

తా. తరువాత ఆ అర్జునుడు గొప్ప తేజస్సుతో సకల దిక్పాలకుల కిరీటములచేత, సేవింపబడిన పీఠము కలవాడై కురురాజు గౌరవమునకు భంగము కలిగించు విలాసము కలవాడు (ద్రౌపదితోడ చిరకాలము సుఖముగా ఉండి) కృష్ణునితో కూడిన

వాడు అయి కౌరవులను జయించు తృష్ణతో, చిరకాలము క్రీడించెను.

విజయ చరిత్ర శరసేతు బంధన కథనం నామ షోడశపటలః

శ్లో॥ **అత్రైవోదాహరం తీమం ఇతిహాసంపురాతనుం**
**కురుపాండవ సంగ్రామే ప్రవృత్తే ద్వాపరేయుగే**

తా. ద్వాపరయుగమందు కురుపాండవ సంగ్రామం జర్గుచుండగా

## శ్రీ హనుమద్గీతాభాష్య ప్రాదుర్భావం

శ్లో॥ **అర్జునం యుద్ధ విముఖం భగవాన్దేవకీసుతః**
**బోధయామాస తత్వార్ధం గీతాశాస్త్రం దయా వశాత్.**

తా. భగవంతుడు దేవకీ కుమారుడైన శ్రీకృష్ణుడు యుద్ధ విముఖుడైన అర్జునునకు దయావశం వలన వేద తత్వార్ధమును తెలుపు గీతాశాస్త్రమును బోధించెను.

శ్లో॥ **తతః ప్రోవాచ భగవాన్ అర్జునం మధుసూదనః**
**కచ్చిద్బుద్ధం మహా బాహో కచ్చిత్తే హృదయంగమం**

తా. తరువాత భగవంతుడైన మధుసూదనుడు అర్జునుని ఇట్లు (ప్రశ్నించెను) అడిగెను. గొప్పబాహువులు కలవాడా నేను చెప్పినది (భగవద్గీత) తెలిసినదా! బోధ పడినదా! ఇది నీ(కు) హృదయానికి పట్టినదా!

శ్లో॥ **ఇతి కృష్ణవచశ్శృత్వా ప్రాహ పార్థః ప్రసన్నధీః**
**బుద్ధం స్వామిన్నధా పీహ శ్రోతుమిచ్ఛా మ్యహంపునః**

తా. కృష్ణుని వచనమును విని ప్రసన్నమైన బుద్ధికల అర్జునుడు ఇట్లు

పలికెను. స్వామీ! తెలిసినది. ఐనప్పంటికీ ఇక్కడ దీనిని మరల వినవలెనని కోరుకొనుచున్నాను.

శ్లో॥ **సంక్షేపేణ పునర్బ్రూహి ధారణార్థం దయానిధే**
**ఏతస్మిన్నంతరే ప్రాహ హనుమాన్కేతు సంస్థితః**

తా. ఓ దయానిధీ! ధారణ చేయడానికి సంక్షేపముగా మరల చెప్పుము అని అడిగెను.
ఇంతలో జెండా మీద ఉన్నటువంటి హనుమంతుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ **సమ్యగ్బుద్ధం మయాసర్వం ధృతంచ హృదయే తథా**
**కాలాంతరే ప్రవక్ష్యామి తుభ్యం సాధుమహామతే!**

తా. ఓ సాధూ! మహామతే నాచేత సర్వము (అంతయూ) లెస్సగా (బాగుగా) తెలియబడినది. హృదయమందు ధరించబడినది. నీకు తరువాత చెప్పగలను.

శ్లో॥ **ఇదానీం యుద్ధ కాలోఽయం యుధ్యస్వ విగతజ్వరః**
**ఇతిశ్రుత్వావచః కృష్ణో మారుతిం కేతు వాసినం**

తా. ఇది యుద్ధ సమయం. ఎటువంటి తాపమూ లేకుండా యుద్ధ చేయుము (అర్జునునితో ఆంజనేయుడు అన్న). ఈ మాటలు విన్న కృష్ణుడు మారుతిని గూర్చి ఈ క్రింద విధముగా పలికెను.

శ్లో॥ **ప్రోవాచ హనుమన్నాజ్ఞాం వినామమ కథం త్వయా**
**గృహీతా బ్రహ్మ విద్యేయం మహామంత్రా త్మికాశుభా**

తా. ఓ హనుమా! మహామంత్రాత్మక మైనటువంటిది. శుభకరమైనటు వంటిది. అటువంటి ఈ బ్రహ్మవిద్యను నా ఆజ్ఞ లేకుండా నీవు ఎట్లు గ్రహించితివి?

శ్లో॥ ఆజ్ఞాంవినా గురోర్యస్తు మంత్రం గృహ్ణాతి మూఢ ధీః
నతస్య సుకృతం తస్మాత్ పిశాచత్వంచ గచ్ఛతి

తా. ఏ మూఢమతులు అయితే గురువాజ్ఞ లేకుండా మంత్రం గ్రహిస్తారో వారికి సుకృతం (పుణ్యం) కలుగదు. వారు పిశాచత్వాన్ని పొందుతారు.

శ్లో॥ తస్మాద్వివేకినాతాత కిమకారి కుచేష్టితం
పైశాచ్యం ప్రాప్స్యసే సత్యం సత్యమేతన్నసంశయః

తా. నాయనా (హనుమా) ఎల్లప్పుడూ వివేకం కల్గినటువంటి నీవు ఈ చెడ్డపనిని ఎట్లు చేసితివి? నీవు పైశాచ్యమును (పిశాచత్వమును) పొందగలవు. ఇది సత్యము ఇందులో సంశయము లేదు.

శ్లో॥ ఇతికృష్ణ వచ శ్రుత్వా అవరుహ్య ధ్వజాగ్రతః
జగ్రాహపాదౌ హనుమాన్ కృష్ణస్య పరమాత్మనః

తా. ఈ విధమైన కృష్ణుని వాక్కులను విన్న హనుమంతుడు ధ్వజము (జెండా) యొక్క అగ్రభాగాన్నుండి (పై భాగమునుండి) దిగిన వాడై పరమాత్ముడైనటువంటి కృష్ణుని యొక్క పాదములను పట్టుకొనెను.

శ్లో॥ ఉవాచచ భయావిష్టః కాగతిర్మే దయానిధే
కేనో పాయేన మే స్వామిన్ పిశాచత్వం నివర్తతే।
కథం వా బ్రహ్మవిద్యామే సఫలం సంభవిష్యతి

తా. భయాన్ని పొందినటువంటి హనుమంతుడు ఈ విధముగా పలికెను. ఓ దయానిధీ! నాకు గతి ఏమిటి? ఏ ఉపాయము చేత పిశాచత్వం తొలగును స్వామీ! నాకు బ్రహ్మవిద్య ఎట్లు సఫలము కాగలదు. ఇట్లు అడగబడిన వాడైన భగవంతుడైన శ్రీకృష్ణుడు హనుమంతుని గూర్చి పలికెను.

**శ్లో॥ సమాప్తే కౌరవే యుద్ధే తనుం పైశాచకీం గతః**
**సేతుబంధం తతో గత్వా స్నాత్వా పైశాచతీర్థకే।**

తా. కౌరవ పాండవ యుద్ధము సమాప్తమైన తరువాత పైశాచకత్వాన్ని పొందినవాడవై సేతుబంధనమునకు వెళ్ళి పైశాచతీర్థ మందు స్నానము చేసి

**శ్లో॥ రామేశ్వరం సమభ్యర్చ్య బ్రహ్మహత్యా వినాశనం**
**గీతాశాస్త్రస్య కృత్స్నస్య భాష్యంకురు మహామతే**

తా. బ్రహ్మహత్యను పోగొట్టేటటువంటి రామేశ్వరుని పూజించి గొప్పబుద్ధి కలిగిన హనుమ సమగ్రమైన గీతాశాస్త్రమునకు భాష్యం చేయుము (భాష్యం వ్రాయుము)

**శ్లో॥ త్వాంవినాన్యేన కో ప్యత్ర సమర్థోహి మహీతలే**
**త్వన్ముఖాదేవ లో కేషు ఖ్యాతంశాస్త్రం భవిష్యతి**

తా. నిన్ను విడిచి ఇతరుడెవడూ ఈ భూమండలమందు సమర్థుడు కాడు. నీ ముఖము నుండియే లోకమందు (జనులందు) ఈ గీతా శాస్త్రం ప్రఖ్యాతి నొందగలదు.

**శ్లో॥ అన్యధాదుర్గ్రహత్వేన లోకస్యానుపకారకం**
**భవిష్యతి మహాబాహోత్త్వత్తోనాన్యోస్తి ధర్మవిత్**

తా. మహాబాహో! ఈ భాష్యము లేకుండా గీతాశాస్త్రము యొక్క తత్త్వమును గ్రహించుటకు శక్యము కాకపోవుట చేత లోకమునకు ఉపకరించు నదికాదు - ధర్మము తెలిసినవాడు నీకంటే వేరొకడు లేడు.

**శ్లో॥ తథాపిత్వం మయాతాత! మోహితః కార్యగౌరవాత్**
**ఏవంకృతే మహాభాగ పిశాచత్వా ద్విమోక్ష్యసే**

తా. అయినప్పంటికీ - గీతాభాష్యమును నీచేత రచింపచేయుట అనే గొప్ప కార్యం (నెరవేర్చుకునే) నెపంతో నిన్ను నేను మోహింప చేసినాను. (అందుచేత) కాబట్టి నీవు గురువు అనుమతి లేకుండా గీతాశాస్త్రాన్ని గ్రహించడమనే అధర్మాన్ని ఆచరించావు. ఓ భాగ్యవంతుడా! ఇలా చేసినట్లైతే పిశాచత్వమునుండి విముక్తి పొందగలవు.

శ్లో॥ లోకానాముపకారోపి గీతాశాస్త్ర వివేచనాత్
పైశాచికం భాష్యమితిలోకే ఖ్యాతింగమిష్యతి

తా. ఈ భాష్యము ద్వారా గీతా శాస్త్రమును వివేచించడం (వివేకంతో తెల్పుకోవడంవలన) జనులకు ఉపకారం కలుగును. ఈ భాష్యము పైశాచిక భాష్యమని ప్రఖ్యాతి పొందగలదు.

శ్లో॥ భాష్యం త్వయా కృతం భద్రం భావినాముపకారకం
ఇతిశ్రుత్వా మాధవస్య వచనం వాయునందనః॥

తా. నీచేతను రచింపబడిన, మంగళ కరమైన ఈ భాష్యము భావిలో (భవిష్యత్తులో) జనులకు ఉపకారము కల్గించును. అనిన కృష్ణుని యొక్క మాటను హనుమంతుడు విని.

శ్లో॥ ధృత్వావాయు శరీరంచ గత్వారామేశ్వరం శుభమ్
స్నాత్వాపైశాచకీ తీర్థే పూజయిత్వా మహేశ్వరం

తా. హనుమంతుడు వాయు శరీరాన్ని ధరించి (పిశాచత్వమునుపొంది) శుభమైన రామేశ్వరమునకు వెళ్ళి పైశాచిక తీర్థమున స్నానము చేసి మహేశ్వరుని పూజించి.

శ్లో॥ జ్ఞానతోయమయం తీర్థం కృత్వాతత్ర మనోహరం
సర్వాఘౌఘహరం పుంసాం హనూమద్భక్తి దాయకం

తా. మనోహరమైన జ్ఞాన జలముతో నిండిన తీర్థాన్ని ఏర్పరిచి అన్ని పాపాలు పోగొట్టేది హనుమంతుని యందు భక్తి కల్గించేది.

శ్లో॥ **గీతాశాస్త్రైకతత్వార్థజ్ఞానదం సర్వదేహినాం**
**తత్తీరేచప్రతిష్ఠాప్య లింగమేకం సుశోభనం**

తా. సకల దేహధారులకు గీతాశాస్త్రము యొక్క తత్వార్థజ్ఞానాన్ని కల్గించే టటువంటి శోభనమైన శివ లింగమును అక్కడ ప్రతిష్ఠించెను.

శ్లో॥ **గీతాశాస్త్రస్య మతిమాన్ భాష్యంచక్రే స విస్తృతమ్।**
**సర్వోపనిషదాం సారం పరం బ్రహ్మ సనాతనం।**
**యేన ప్రకాశితం సమ్యగ్గీతార్థ ప్రత్యగద్వయం**

తా. ఆ బుద్ధిమంతుడైన హనుమంతుడు విస్తృతమైన గీతాభాష్యమును రచించెను. అది అన్ని ఉపనిషత్తులకు సారంవంతమైనది. గీతా శాస్త్రమునకు అర్థమైన అద్వయం, సనాతనం, ప్రత్యగాత్మరూపమైన బ్రహ్మ ఆభాష్యముచే ప్రకాశింప చేయబడెను.

*ఇతి హనుమద్విరచిత గీతా పైశాచిక భాష్య ప్రశుసా సంపూర్ణా.*

-: శుభమ్ :-

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం॥

-: స్వస్తి :-

శ్లో॥ త్వయా దాయాదవానస్మి కృతార్థో2 ముత్ర ఏవచ,
సత్పుత్రేణ త్వయాపుత్ర ధర్మజ్ఞేన విపశ్చితా॥ 148

తా॥ కుమారా ! ధర్మము తెలిసిన, విద్వాంసుడవైన సత్పుత్రుడవైన నీచే. నేను ఇహపరలోకముల రెండింటియందు కృతార్థుడనైతిని.

శ్లో॥ మయాతు తవజిజ్ఞాసా ప్రయుక్తైషా దృఢవ్రత,
వ్యవస్థానంతు ధర్మేషు కర్తుంలోకస్య చానఘ॥ 149

తా॥ దృఢమైన బ్రహ్మచర్య వ్రతముకలవాడా పాప రహితుడా ! భీష్మా లోకులకు ధర్మమందు ఆసక్తి దృఢముగా చేయదలచియే నేనిట్లు పరీక్షించితిని.

శ్లో॥ యధాచతుర్థం ధర్మస్య రక్షితా లభతే ఫలం,
పాపస్యహి తధామూఢః ఫలం ప్రాప్నోత్య రక్షితా॥ 150

తా॥ ధర్మమును రక్షించువాడు ధర్మములోని నాల్గవ వంతు ఫలమును పొందుచున్నాడు, అట్లే ధర్మము తెలియని మూఢుడు ధర్మము రక్షించనివాడై పాపము యొక్క 4వ వంతు ఫలమును పొందుచున్నాడు.

ఈ ముఖ చిత్రము శ్రీ కోటమర్తి వేంకట నరసింహమూర్తిగారు, M.A. కొవ్వూరు మరియు శ్రీ చెరుకుపల్లి విశ్వనాధశర్మగార్లు (పిఠాపురం) వారి సౌజన్యంతో ముద్రించబడినది.

శ్లో॥ నారికేళ ప్రమాణంతు ప్రత్యబ్దేమాసికేతధా,
ఏకోద్దిష్టే సపిండేతుకపిత్థంతువిధీయతే
తీర్థే ధర్మేచ సంప్రాప్తే శ్రీఫలస్యప్రమాణతః
మహాలయే గయాశ్రాద్ధే కుర్యాదామలకోపమం 151

తా॥ పిండం తద్దినంలోను మాసికమునందు మరియు సంవత్సర విమోకంలో కొబ్బరికాయంత ప్రమాణంతో ఏకోద్దిష్టంలో వెలగపండంత, తీర్థ, క్షేత్ర శ్రాద్ధాదులలోను, అమావాస్య పిండ పితృయజ్ఞాలలోను మారేడు కాయంతగా మహాలయంలో మరియు గయా శ్రాద్ధాదులలో ఉసిరిక పండతగా చేయవలెను.



# గుళ్ళపల్లి వెంకటనాగ శ్రీరామశర్మ

## జెండాపై కపిరాజు

| | |
|---|---|
| జననం | : 16-11-1961 ప్లవనామసంవత్సర కార్తీకశుద్ధ అష్టమీ గురువారం |
| జన్మస్థలం | : ఇరగవరం (మండలం), 534 217, ప.గో.జిల్లా<br>ఫోన్: 08819-289457, సెల్: 94411 72261. |
| జననీజనకులు | : బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి సీతారామావధాన్లు గారు,<br>: శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు |
| విద్య | : శ్రీకృష్ణయజుర్వేదం, స్మార్తం, సాహిత్యం, హిందీ విశారద |
| గురువులు - వేదం | : బ్రహ్మశ్రీ గుళ్ళపల్లి సీతారామావధాన్లు గారు |
| సాహిత్యం | : బ్రహ్మశ్రీ వడ్డి వేంకటశాస్త్రిగారు |
| స్మార్తం | : బ్రహ్మశ్రీ మునుకుట్ల సుబ్రహ్మణ్య దీక్షితులు గారు (అవు మేష్టారు) |
| హిందీ | : బ్రహ్మశ్రీ కూచి రామకృష్ణ గారు, ఎం.ఏ. |
| భార్య | : శ్రీమతి సూర్యకుమారి |
| వృత్తి | : తిరుమల తిరుపతి దేవస్థాన వేదపారాయణ |
| ఆసక్తి | : నిరంతరం గ్రంథ పఠనం |
| ఆశయం | : సంస్కృత వాఙ్మయాన్ని ప్రజలకు అందించడం |
| ముద్రిత గ్రంథాలు | : సుభాషిత సంగ్రహము, భారతసావిత్రి, మానవధర్మాలు, చమత్కారచంద్రిక, శ్రీ కేశవస్వామి దివ్య చరిత్ర |
| వ్రాయబోవు గ్రంథం | : కవికావ్యసూచి (కవులు-కావ్యములు) |